# ఎర్రభూతం

[కథలు]

'శార్వరి'




ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ-1.

తొలి కూర్పు
వేయి ప్రతులు
1952
ముద్రణ
హైమవతీ ప్రెస్ లిమిటెడ్
విజయవాడ

వెల
రూపాయి

సంపాదకుడు :
గద్దె లింగయ్య

ఇందులో

28.8.54

# ఎర్రభూతం

తెల్లవారేసరికి "గుప్పు" మన్నది. జనం గుంపులు గుంపులుపడి ఆలోచించసాగారు. మా గ్రామ రక్షణదళ నాయకుడూ, మరి కొంతమంది దేశభక్తులూ కలిసి, ఈ విషయాన్ని గురించి తీవ్రంగా ఆలోచించారు.

రాత్రి తెల్లవార్లూ ముఠాలుముఠాలుగా విభాగులమై వొళ్ళంతా కళ్ళుచేసుకొని, చీమ చిటుక్కుమన్నా జాగ్రత్త తీసుకొంటూ, గ్రామాన్నంతా కాపాడుతూనే వున్నాం. ఎట్లా వొచ్చిందో తెలీదు. ఎప్పుడు వచ్చిందోగూడా తెలీదు. ఒక కుక్క - అందులో ఎర్రకుక్క మా వూరొచ్చింది. అది మా వూరి కుక్కేమోననే అనుమానం మొదట కలిగింది. ఈ విషయం అవునో కాదో అని నిరూపించుకొనేదానికోసం, ఆ కుక్కను వెంటబెట్టుకొని, పదిమంది పోలీసులు తుపాకులతో సహా ఆ శ్వానరాజాన్ని పరివేష్టింప ఇంటింటికి తిరిగాము. మరేమీ లేదు. ఇటీవల కొంతమంది "దేశద్రోహులు"- "దుండగీండ్రు"-"బందిపోటుగాళ్ళు"— దేశాన్నంతా నాశనం చేస్తున్నారనీ. దోపిడీలు, గృహదహనాలు జరుపుతున్నారనీ, శాంతి- సౌభాగ్యాలతో మూడు పువ్వులు ఆరు కాయలుగా వెలిగిపోతున్న ప్రభుత్వాన్ని చీకాకుపరచటం జరుగుతున్నదనీ అందరికీ తెలిసిన విషయమే!

ఆ దుర్మార్గులు రాకుండా, గ్రామగ్రామానా "సముచిత చర్యలు" ప్రభుత్వంవారు తీసుకొన్నారనేదిగూడా జగద్విదితం. రాత్రిగావటం భయం! ఒక్క పురుగు మెదలడానికి వీల్లేదు. ఇంట్లోవాళ్ళు వీధిలోకి రావడానికి వీల్లేదు. ఒకటికీ, రెంటికీ పోవటానికి చాలా ఇబ్బందిగా వున్నదని కొంతమంది తెలివితక్కువ వెధవలు గోలపెట్టారు గాని, మేము వాటిని లెక్కచెయ్యలేదు. వారిమీద కోపంగూడా రాలేదు. దేశమంటే ఏమిటో వారికి తెలియనందువల్లనే అట్లా మాట్లాడారు. దేశంకోసం ఎవరెవరు ఎటువంటి మహాత్యాగాలు చేశారో వారికి వోపిగ్గా బోధించాం. "ఇటువంటి దుండగీండ్రను అణచి, భూమండలాన్ని సురక్షితం చేసే కార్యక్రమంలో మీరీ కొద్ది ఇబ్బందులు పడాలి" అని నచ్చచెప్పాం. వారికి మా బోధలు అర్థమైనయ్యో, లేదో గానీ మళ్ళీ కిక్కురుమనలేదు.

ఇంత కట్టుదిట్టంగానూ, పకడ్బందీగానూ వున్నప్పటికీ, ఎప్పుడు ఎట్లా, ఏవిధంగా వొచ్చిందో ఆ ఎర్రకుక్క వొచ్చింది. మా కంటబడింది. అది మా వూరు రావటానికి కారణాలేమిటో, ఏ ఏ వర్గాల ప్రోద్బలంతో, ఏ ఏ రాజకీయాశయాలతో ఆ కుక్క మా వూరొచ్చిందో తెలుసుకోవలసిన మహత్తర బాధ్యత మా భుజస్కంధాలమీద వుంది.

మేము తెలివితక్కువవాళ్ళం గాదు. రెండు మూడు రోజులు అతి జాగ్రత్తగా దాని ప్రవర్తనను పరిశీలించాము. మాలో కొంతమందికి అది దేశద్రోహుల ఏజెంటేమోనని అనుమానంగూడా కలిగింది.

ఈ సంక్షోభ నివారణనిమిత్తం వెంకటేశ్వర్లుగారి అధ్యక్షతక్రింద మేమొక రహస్య సమావేశాన్ని ఏర్పాటుచేశాము. వెంకటేశ్వర్లుగారు లక్షాధికారి. గింజలు, కిరసనాయిలూ, పట్టాలు దొరక్క ప్రజలు నానా గడ్డి కరిచే సమయంలో, వెంకటేశ్వర్లుగారు రహస్యంగా అవన్నీ ప్రజలకు సప్లయిచేసి— హెచ్చుధరే కావొచ్చు—ప్రజలపట్ల తమ ఆదరాభిమానాలను రుజువుచేసుకొన్న ప్రజాస్వామికవాది.

వెంకటేశ్వర్లుగారు మా సందేహాలన్నిటినీ పటాపంచలు చేశారు.

"సోదరులారా! భయపడకండి. ఈ కుక్క విషయం సాకల్యంగా నేను గ్రహించాను. రెండుమూడు గంటల క్రిందట వొచ్చిన తాజావార్తలనుబట్టి అది మరింత ధృవపడింది. మనకు వుత్తరదిశగా వున్న గ్రామం ఒకప్పుడు దేశద్రోహులకు పుట్టినిల్లని మానందరికి తెలిసిన విషయమే. ప్రస్తుతం వాళ్ళందరూ దేశమ్మకాములయిపోయినారు. అయినా ఆ లోఫరుగాళ్ళు మన శాంతిసామ్రాజ్యాన్ని ధ్వంసం చేయాలనే చూస్తున్నారు. కొంతమంది వేగులను పంపించి ఎప్పటికప్పుడు సంగతి సందర్భాలు తెలుసుకొంటున్నారు. అందులో ఒక భాగమే ఈ కుక్క మనవూరు రావటం! దాని ఆకారం, రంగూ మీరంతా చూశారు. అది ఎర్రగా వుంది. ఎరుపురంగు మన దేశద్రోహులకు చిహ్నం. అందులో ఈ కుక్క ఆ వూరివేపు మొహంపెట్టి అరవటం మనం గమనించదగ్గ విషయం.

"ఇందులో ఎవరికీ సందేహముండవలసిన అవసరం లేదు. ఇది ఆ "కం..." గాళ్ళ పనే! కానిపక్షంలో ఈ కుక్క

ఆవూరునుంచే రావటం ఎందుకు? పురుగులు, కుక్కలు, పక్షులు మొదలయిన ప్రాణులద్వారా మన రహస్యాలను గ్రహిస్తున్నారు. వీటిని మనం తేలిక సమస్యలుగా త్రోసివెయ్యటానికి వీలులేదు. అవి వచ్చి, మన రహస్యాలను తెలుసుకొని, అరుపులద్వారాను, కూతలద్వారాను తమవారికి తెలియజేస్తున్నాయి. పూర్వం రష్యాదేశంలోగూడా కమ్యూనిస్టులు ఇట్లాగే చేశారని చరిత్ర ఉద్ఘోషిస్తున్నది.

"రేపటినుండి మన మొక కొత్తపంథా అవలంబించాలి. మనవూళ్లో వున్న కుక్కలు, పందులు, పిల్లులు వగయిరా జంతువుల లెక్కలు తియ్యాలి. ప్రతిరోజు సాయంత్రం వొక కమిటీ ఆ యా జంతువులను తనిఖీ చేస్తుంటుంది. ఒక్కటి ఎక్కువవున్నాసరే విచారణ లేకుండా కాల్చిపారవేయవచ్చు. కొంతమంది అతి ముఖ్యమైన ప్రదేశాల్లో నియమింపబడి వుంటారు. ఆ వూరివేపు పోయే ప్రతి పక్షినీ, వొస్తున్న దాన్నీ కాల్చిపారేస్తారు. ఈవిధంగా మన స్థితి కొంత చక్కబడుతుంది."

వారి అపార మేధాసంపత్తికీ, విజ్ఞానానికీ ఆశ్చర్యపోయాము.

"రేపే ప్రభుత్వానికి ఈ విషయం తెలియచేద్దాము. మీా అభిప్రాయ మేమిటి?" అన్నారు వెంకటేశ్వర్లుగారు మా అందరివంకా చూసి.

తెల్లవారే ప్రభుత్వంవారికి కాగితాలు పోయినయ్. నాలుగురోజులకల్లా లారీలనిండా పోలీసులు దిగారు. ఈ

లోపుగా కుక్కను రచ్చబండదగ్గర గొలుసులతో కట్టేశాం. దుడ్డుకర్రలతో కొంతమంది కాపలాలు కాశారు.

అది ఘోరంగా ఉరవటం సాగించింది.

"చూశారా! అది తనవాళ్ళకు వార్తలను అంద చేస్తోంది. బహుశా వాళ్లు దాడిచేయవొచ్చు" అన్నారు వెంక టేశ్వర్లుగారు. ఆ భయంవల్ల గ్రామంచుట్టూరా బరిసెల తోటీ,బల్లాలతోటీ జనాన్ని కాపలా పెట్టడం జరిగింది.

నాలుగు లారీలనిండా పోలీసు లొచ్చారు. వచ్చీ రావ డంతోనే తుపాకులు ఎక్కుబెట్టారు. జనాన్ని దూరంగా పొమ్మన్నారు. కుక్కను దూరాన్నుంచే చుట్టుముట్టి ఒక్క సారి తుపాకులు కాల్చారు ఆ మోతకు మా చెవులు దిబ్బట పడ్డాయి. కుక్క చిన్నచిన్న ముక్కలుగా తెగిపోయింది. మా కృతజ్ఞతాసూచకంగా పోలీసులకు ఆ పూట కోడిపలావుతో "విందు" యివ్వబడింది.



# శాంతిసోపానం

ఉషాకాంతుల్ని తనలో విలీనం చేసుకున్న తూరుపు ఎర్రగా మండుతోంది. ఇంకా సూర్యోదయం అయేందుకు అవకాశం వుంది. అది ప్రకృతిసహజం. ప్రపంచంలో భీభత్సరస ప్రధానంగా విలయతాండవం జరిగితేనేగాని శాంతిరాదు అలజడి అణుగునే శాంతి కాపురం చేస్తుంటుంది. కాదనేందుకు ఎవరికీ దమ్ములు లేవు.

తూరుపుగా రాచబాటలో అలజడి ప్రారంభమయింది. అప్పుడే కళ్ళు తెరుస్తున్న అయోధ్య ఆశాకిరణాలు ప్రసరించినయ్ తూరుపుగా. కాని నిరాశ సమాధానపరిచింది. అంతఃపురంలో సౌమిత్రి వచ్చిన వార్తలు అందినయ్. రామచంద్రుడింకా మగతనిద్రలోనే వున్నాడు. సౌమిత్రి రావటం రామచంద్రుని చెవుల్లో పడేట్లుగా చెప్పుకుంటున్నారు పరిచారికలు.

సౌమిత్రిపేరు వినపడగానే రామచంద్రుడుదిగ్గున లేచాడు. వొళ్ళువిరుచుకుని, నిద్దరకళ్ళతో చూచాడు నలువైపులా ఎవరూ కనుపించలేదు.

“ఎవరూ?” అన్నాడు రామచంద్రుడు.

ఎవరూ పలకలేదు, రాలేదు. చాలా ఆశ్చర్యం. అయోధ్యామహారాజు శ్రీరామచంద్రుడు నిద్రలేచేసమయానికా ఎవరూ దగ్గర లేకపోవటం! కానీ, అంతా సౌమిత్రిని గురించిన విచారంలో వున్నారు.

సౌమిత్రి శ్రీరామచంద్రుని పంపున సింహళంపై దండె త్తాడు. సింహళంలో విభీషణరాజ్యంగదా, రామచంద్రుడు ప్రారంభోత్సవంచేసి, విభీషణునికి సింహళాన్ని వప్పగించాడు గదా? అంటారు.

కావచ్చు. కానీ, రామచంద్రుడు సింహళంలో నియమించిన ప్రతినిధి విభీషణుడు. శత్రువు తమ్ముడు శత్రువైనాడు. అన్నరాజ్యాన్ని తమ్ముడికి దానంచేసి తన ప్రభావాన్ని, ధర్మస్తంభాన్ని నాటదలుచుకున్నాడు రామచంద్రుడు. కానీ లంకావాసులకు రాముని చేష్టలు గిట్టలేదు. గిట్టే అవకాశంకూడా లేదు. ఎక్కడో ఉన్న సింహళంమీద ఈ యోధ్యవాసులు ఆధిపత్యం చలాయించటం ఏంన్యాయం? ఏ అంతర్జాతీయ న్యాయశాస్త్రం అంగీకరిస్తుంది గనక?

అందుకనే లంకావాసుల్ని రాక్షసులు అన్నారు వానరులు, నరులు. వీళ్ళదృష్టిలో- ఈ కోతిమూక దృష్టిలో రాక్షసులు నింద్యులు. అది ఎదురుగా అనేందుకు దమ్ములులేవు. రాక్షసులుగా, నింద్యులుగా చెప్పబడే లంకేయులు సర్వస్వాతంత్రులు. మరొకరు తమమీద ఆధిపత్యం చలాయించటం వారికిష్టంలేదు. విశ్వవిజ్ఞానం వారిలో మూర్తీభవించింది. వారిలో ప్రతివొక్కడు విశ్వవిజ్ఞాని. విశ్వసంస్కర్త. ప్రపంచాన్నంతా పరిపాలించగల సామర్థ్యం ప్రతివొక్కరిలోనూ వుంది. ప్రపంచంలో ఎవరికీ తెలియని మారణాస్త్రశాస్త్రం వారికి తెలుసు. అందుకనే వారంటే అసూయ ఈ వానరులకు, నరులకూను. వారిని జయించేందుకు అవకాశంలేదు.

విభీషణుడు స్వతంత్రించటంలో తప్పులేదు. సర్వశక్తిసంపన్నుడు ఒకరి చేతుల్లో ఉండవలసిన అవసరం ఏముందిగనక?

సౌమిత్రి అంతఃపురంలో ప్రవేశించాడు. ప్రజలు తండోపతండాలుగా సౌమిత్రి దర్శనకోసం తహతహలాడుతున్నారు. కాని అంగరక్షకులు ఎవరినీ లోనికి రానీయటంలేదు ప్రముఖ రాజకీయవేత్తలను మినహా. విభీషణునిమీద దండెత్తి కన్నులొట్టబోయి, జడిసిపోయి ప్రాణాలతో బయటపడ్డాడు సౌమిత్రి. సౌమిత్రి తల పగిలింది ఒంటినిండా గాయాలు. బ్రతుకే దుర్భరంగావున్న పరిస్థితి. సౌమిత్రి స్థితిచూసి రామచంద్రుడు అంతా గ్రహించాడు. మిగిలిపోయిన సైన్యం పదిమందికిపైగా మాత్రమే పోయిన ధనాలుగు వేలకుగాను. వైద్యులు మంచి మంచి ఔషధాలనే వాడుతున్నారు.

సౌమిత్రి పరిస్థితులుచూచి విదేశాంగ మంత్రి ఆంజనేయుడు ఆకాశమెత్తు దేహాన్ని పెంచాడు. శోకపెంచాడు. ఒట్టి కోతివెధవ, కోతిచేష్టలు! అంతకన్నా చేయగలిగింది లేదు మరి బ్రతుకుకు.

శ్రీరామచంద్రుడు ఆలోచించాడు గత్యంతరం ఏమిటా అని. ఏమీ పాలుపోవటంలేదు. కానీ, మెరుపులాంటి ఆలోచన వొకటి తట్టింది. కళ్లు హాసించినయ్. మొహం తేజోవంతమయింది. ఆగ్నేయాస్త్రం ప్రయోగిస్తే—

అవును. ఆగ్నేయాస్త్రం వెనుకటి యుద్ధంలోకూడా ప్రయోగించలేదు. నిజమే. చాలా ప్రమాదమయిందే. ఆ ఆయుధం అనన్యభేద్యమయింది. ఒక్క ఆయుధంతో రాక్షసమూకే నాశనం అవుతుంది. తమకు శత్రుపక్షం లేకుండాపోతుంది.

కాని వెంటనే మరో భయంకూడా పట్టుకుంది. ఆ ప్రయోగించే ఆగ్నేయాస్త్ర ప్రభావం అయోధ్యవరకూ వ్యాపిస్తే, అయోధ్య ప్రజలూ నాశనమైతే, తానూ నాశనమైతే మరి ప్రయోజనం!

ఏమైనాసరే విభీషణునితో సంప్రదింపులు జరపాలి. తన ఆగ్నేయాస్త్రాన్ని చూపించి బెదిరించి లొంగదీసుకోవాలి! నిజమే; ఆలోచన అయితే గొప్పదే. మరి అసలు విభీషణుడి దగ్గరకు పోయేదెవరు? పిల్లిమెళ్ళో గంట కట్టే ఎలుక ఎవరు? రామచంద్రుడు ఆంజనేయుడి వంక చూశాడు. ఆంజనేయుడి శరీరం కుంచించుకుంది. సౌమిత్రివంక చూచాడు. సౌమిత్రి ముసుగుపెట్టుకుని పక్కకు తిరిగి పడుకున్నాడు. తనవంక తనే చూచుకున్నాడు. శరీరం పులకరించింది. అయితే ధైర్యవంతులు అయోధ్యా నగరంలో వొక్కరూ లేరా! వూరంతా చాటింపించాడు. నరులెవరూ కదల్లేదు. వానరులంతా తోకలు ముడుచుకున్నారు. జంతువులన్నీ మాయమయినయ్.

"విభీషణుడికి ఒక్క సందేశాన్ని అందజేయులేని చవట వెధవలు అయోధ్యావాసులని నే ననుకోవటంలేదు. రేపు యుద్ధం వస్తే ఏం చేస్తారు మీరంతా? చేతులు కట్టుకుని వొళ్ళప్పగిస్తారా?" అని గంభీరోపన్యాసం చేశాడు శ్రీరామచంద్రుడు. సౌమిత్రి ముసుగు మెడవరకు తీసి చూశాడు ఎవరైనా ముందు కొచ్చారేమోనని. ఆంజనేయుడు తోక ఆడించాడు.

ఓ ఎర్రచిలుక ముందుకొచ్చి మానవ భాషలో మాట్లాడింది "నేను" అని.

రామచంద్రుడికి ఆశ్చర్యం వేసింది ఈ "చిలుకా" అని. కాని తప్పదు అంతకన్నా ధైర్యవంతులు ఎవరూ లేరు మరి.

రామచంద్రుని సందేశాన్ని చిలుక చేర్చింది విభీషణునికి. విభీషణుడు చిలుకను చాలా గొప్పగా ఆదరించాడు. కాని, సందేశాన్ని అందుకుని నవ్వాడు "సంధి!" అని.

విభీషణుడి సమాధానం ఏం లేదు: ఎర్రటి చిలుకను పచ్చగా మార్చి తిరిగి అయోధ్యకు పంపివేశాడు.

రామచంద్రుడు చిలుక రావటం గ్రహించాడు. కాని తానుపంపిన చిలుక కాదు. కాకపోయేందుకు వీలూ లేదు. మానవభాషే మాట్లాడుతోంది. ఆశ్చర్యంలేదు. కాని రంగు మారటం ఆశ్చర్యం.

"ఇదేమిటి?" అన్నాడు రామచంద్రుడు.

"అంతే. ఇదే సమాధానం. వాళ్ళ విజ్ఞానానికి నిదర్శనం యిది. యిదే కాదు. యుద్ధంలో చచ్చినవారంతా తిరిగి బ్రతుకుతున్నా రక్కడ! సంజీవికన్న గొప్ప మందులు కనిపెట్టేరు వారు" అని ఒక్కసారి రెండురెక్కలూ విదల్చింది చిలుక. బంగారపు రంగులో "శాంతి" అని రెండురెక్కల మీదా వ్రాసివుంది. యిదే వారు పంపిన సమాధానం. ఏంచోద్యం! ఏం ఆశ్చర్యం!!

కాని రామచంద్రుని మనస్సు శాంతించటం లేదు. అసూయ, కసీని, వాళ్ళంత విజ్ఞానసంపన్నులయారే అనీ, తన చెప్పుచేతల్లోకి వారు రాలేదే అనీ. తనమోచేతి నీళ్ళు వాళ్ళకు రుచించలేదే అని ఎక్కడలేని కచ్చి.

ఎందుకు రుచించాలి విజ్ఞానికి?

శ్రీరామచంద్రుని నరాలు వేడిరక్తాన్ని కాగబెడు తున్నయ్. శరీరం వెచ్చగా ఆవిరికొడుతోంది. కళ్లు ఎర్రగా జ్యోతుల్లాగా మెరిసినయ్. మారణాస్త్రం, ఆగ్నేయాస్త్రం, తను, తన రాజ్యం, అయోధ్య కీర్తి, ప్రాణం, సంకుల సమరం!

దేవతలు ప్రసాదించిన పుష్పక విమానం కళ్ళకు కని పించింది. ఆగ్నేయాస్త్రం చేతిలో తళుక్కుమన్నట్లుగా వుంది.

అదే తుది సమరం. అంతకు మించిన విషయం లేదు.

ఈసారి యుద్ధభేరి మ్రోగించటం లేదు. సైన్యం అవ సరంలేదు. ఎవరికీ తెలియాల్సిన అవసరంకూడా లేదు. తనొ క్కడే చాలు

ఎప్పుడు లేచి వెళ్ళింది తెలియదు ఎవరికీని. తెల్లవారే సరికి శ్రీరామచంద్రుడు మంచంమీద లేడు. పుష్పక విమా నం లేదు. అంబులపొదీ లేదు. సౌమిత్రి శరీరం చల్లబడ్డది పరి స్థితులు తలుచుకుంటే. ఆంజనేయుడితోక టకటకా కొట్టుకో నారంభించింది.

రామచంద్రుడు బిక్కమొగంతో జాముప్రొద్దెక్కే కాలి నడకన అయోధ్యకు చేరుకున్నాడు. సౌమిత్రి ఎదురుగాపోయి అన్నను కావిలించుకున్నాడు.

కాని, రామచంద్రుని మొఖంలో నెత్తురుచుక్క లేదు. చెప్పటం ప్రారంభించాడు–"ఆగ్నేయాస్త్రంమీద ఆశ పెట్టు కున్నాను. కాని ఆయుధానికి తుప్పుపట్టి ప్రయోగార్హం కాక పోయింది. శాంతి తప్పదు. విభీషణుడిని కలుసుకుంటాను. ప్రపంచంలో శాంతిని నెలకొల్పాలి. నా మారణాస్త్రం ప్రయో గార్హంగాదు. ఈనాటికీ ఏనాటికీ కాదు, కాలేదు" అని.

సౌమిత్రి దుఃఖాన్ని ఆపుకోలేక ఏడ్చాడు. ఆంజనేయుడు శోక నేలమీదవేసి గరాగరా రుద్దటం ప్రారంభించాడు దుఃఖాన్ని తట్టుకోలేక.

అదే సమయంలో విభీషణుడు పుష్పక విమానంలో రంగం మధ్యకి దిగి రామచంద్రుణ్ని కావలించుకున్నాడు.

రామచంద్రుని కళ్లు సంతోషంతో విప్పారినయ్. గొంతులోనుంచి అస్పష్టంగా "శాంతి శాంతి" అనేమాటలు వెలువడ్డయ్.

విభీషణుని పెదాలు చిరునవ్వు నవ్వినయి శాంతంగా.





17

# ఎర్రకొండ సాక్షిగా

స్టేషనుకు రెండుమైళ్ళ దూరంగా ఉన్న ఫాక్టరీలు, మైకా గనులు ఆ దేశ సంపద. గనులకు ప్రక్కగా ఉన్న ఎత్తయిన ఎర్రటి కొండలు, కొండల ప్రక్కగా పారుతోన్న నది-అక్కడి ప్రకృతిసౌందర్యం వర్ణనాతీతం. ఎవరైనా గనులను గాని, గనులకు సంబంధించిన వ్యక్తులనుగాని చూడదలిస్తే స్టేషనునుండి రెండుమైళ్ళదూరం నడిచి రావలసిందే! జట్కాలు గానీ, రిక్షాలుగానీ అక్కడ ఉండేందుకు వీల్లేదు. స్టేషనునుండి మైకా ఫాక్టరీలవరకు చక్కని సిమెంటురోడ్డు, రోడ్డుప్రక్కన చెట్లు-వచ్చేవారి ప్రయాణానికి హాయిగానే ఉంటుంది.

ఆ ఫాక్టరీలను అందరూ 'గోకుల్ ఫాక్టరీ' లంటారు. అట్లా అనేందుకు బలవత్తరమయిన కారణాలు లేకపోలేదు. గోకుల్ ఒక సాధారణమైన కూలీ; కాని అసాధారణ వ్యక్తి.

గోకుల్ జీవిత చరిత్ర చెప్పుకోదగ్గ, ప్రశంసింపదగ్గ సంఘటనలతో నిండివుండేదిగాదు. కాని అతని ప్రవర్తన, అసాధారణ ప్రజ్ఞ, దానిని ప్రజ్ఞ అనేందుకు వీల్లేకపోవచ్చు- అతన్ని వ్యక్తిగా జేసినయి. మైకాగనులలో మైకా తీసేటప్పుడు అనేక మంది కూలీలు పడి చనిపోవటం పరిపాటి అయింది. కాని, అలా చనిపోయిన కూలీల సంసారాలు అడుక్కుంటూ దేశాంతరం వెళ్ళిపోవలసివచ్చేది. మిల్లుయజమానులుగానీ, మైకాగనుల

ప్రొప్రయిటరుగానీ వారికి ఏవిధమైన నష్టపరిహారం ఇచ్చే వారు గారు.

ఒకరోజున గని తవ్వుతూ ఉన్నారు కూలీ లందరూ. పైనుండి పెద్దపెట్టున పెళ్ళ విరిగి కూలీలమీద పడ్డది. ఇరవై నలుగురు కూలీలు చనిపోయారు ఒక్క క్షణంలో. అప్పుడే గోకుల్ మిల్లుయజమానులను, ఫాక్టరీ యజమానులను గద్దించాడు—ఆ చనిపోయినవారి కుటుంబరక్షణ చేయమని. కాని యజమాను లంగీకరించలేదు. వాళ్ళ హృదయాలు కరుణరస పూరితాలు గావు. కరుడుగట్టిన శిలాకూపాలు.

గోకుల్ హృదయంలో రగిలే చిచ్చును ఆర్పే సాధనం ఏమీ కనిపించటంలేదు. దావానలంగా మండిపోతోంది అతని లోని ఆవేదన. రాత్రి అయింది. ఉదయంనుండి ఇరవైనాలుగు కుటుంబాల రోదనధ్వని అతనిచెవుల్లో ప్రతిధ్వనిస్తోంది. ఏంచేయగలడు పాపం! ఒక్కడు. ఆలోచనలో నిమగ్నుడై వున్నాడు.

చీకటి పడింది. రాత్రి పదిగంటలు కావస్తూంది. తన గుడిసెలోనుండి బయటకు చూచాడు. ఇంకా రోదనతీవ్రత తగ్గలేదు. ఇల్లంతా కలయజూచాడు. దీపం గుడ్డిగా వెలుగుతోంది. చాపమీద ముసుగుపెట్టుకుని, చలికి వొణుకుతూ దుర్గి నిద్రపోతూనేవుంది.

బైటకు నడిచాడు ఒంటరిగా, చీకటిలో. రగిలే ఆవేదనలతో మిల్లు సమీపిస్తున్నాడు. మిల్లు దగ్గిర అవుతున్న కొలదీ అతనిలో ఉత్సాహం ఇనుమడిస్తోంది. కళ్ళలో రక్తపుజీరలు పొంగుతున్నాయి. ఫాక్టరీ గేటులో కాపలా ఘూర్కా నిద్రపోతున్నాడు. కుక్కలు దూరంగా ఉన్నయి. ఆఫీసుతాళం పగిల

గొట్టాడు. ఇనప్పెట్టె తాళంకూడా పగలిపోయింది అతని పట్టు దలకు త్వరత్వరగా చేతికందినన్ని నోట్లు, కరెన్సీనోట్లు- పుచ్చు కున్నాడు. అంతే. మళ్లీ తలుపులు వేయాలేదు, ఏంలేదు. వెళ్ళిపోయాడు.

గుడ్డిదీపం వెలుగులోనే ఇరవైనాలుగు కుటుంబాలకు పంచిపెట్టాడు. తలా ఒక వెయ్యిచొప్పున వచ్చింది.

ఆ మరునాడు గోకుల్ చేసిన పని తెలిసిపోయింది. కానీ, ఎక్కడా గోకుల్ జాడ లేదు. మేనేజర్లు వెదికారు, వెది కించారు. ఎక్కడా కనుపించలేదు.

అడవుల్లోకి పారిపోయి ఆత్మహత్య చేసుకున్నాడు. అతని శవం ఎర్రకొండలపైన ఈనాటికీ అలాగే ఉందని వినికిడి. అందు వల్లనే, ఆనాటినుండీ ఆ ఫాక్టరీలకు గోకుల్ ఫాక్టరీ లను పేరు వచ్చింది. గోకుల్ చేసిన నేరానికిగాను అతని కూతురు దుర్గి కులట అయింది.

♦ ♦ ♦ ♦

గోకుల్‌కు పెళ్ళికాలేదు. కాని అతని కొక కూతు రుంది. ఆమె దుర్గి. ఎప్పుడూ అతని పోషణలోనే ఉండేది. కాని గోకుల్ చనిపోయినతర్వాత దుర్గిబ్రతుకు బండలపా లయింది. ఆ ఫాక్టరీలలో దానికి పని ఇవ్వలేదు మొదట. కాని, తరువాత కొద్దికూలిమీాద పని దొరికింది. ఉదయంనుండి సాయంత్రం వరకూ ఫాక్టరీలలో కూలిపని చేయటం, రాత్రికి గుడిసె చేరు కోవటం. అదీ ఆమె జీవితచక్రం.

ఒకరోజు సాయంత్రం సూర్యాస్తమయం అయింది. చీకటి పడుతోంది. అందరు కూలీలతోపాటు దుర్గకూడ ఫాక్ట

రీలనుండి బయటకొచ్చింది. తలనిండా దుమ్ముపడి తెల్లగా ఉంది. వొళ్లంతా దుమ్ము. మొఖం తుడుచుకుంటూ దోవ పట్టింది. కాని, అందరుకూలీలు పోతున్న దోవ వేరు – దుర్గి నడుస్తున్న దోవ వేరు. అదేమి టని ఎవరూ అడుగరు. ఆమె అంటే ఎవరికీ సానుభూతి లేదు. కారణం: ఆమె గోకుల్ భార్య కూతురు కాకపోవటమే. పాపం! ఆ తప్పు ఆమె కాపాదించటం ఏం భావ్యం నిజానికి.

ఫాక్టరీలకు దూరంగా చిన్నకోటమధ్యన వుంది బడి. ఆ ప్రాంతాల కూలీలపిల్లలు, పట్టణంనుండి కొందరు పిల్లలు వస్తోంటారు ఆ బళ్ళో చదువుకునేందుకు. సాయంత్రం అయిదు గంటలకే బడి వదలిపెట్టారు.

కాని, కామరాజు పంతులుగారు అక్కడేకూర్చొని గుడ్డిదీపానికి ఎదురుగా పుస్తకం చదువుకుంటూ కూర్చున్నాడు. కామరాజు పంతులుగారు కుర్రవాడే. పాతికేళ్ళకన్న మించిన వయస్సు ఉండదు. మంచి స్ఫురద్రూపి, అందమయినవాడూ.

దుర్గివొచ్చి ఆయనకు ఎదురుగా నిలబడ్డది. పంతులు ఆ అమ్మాయినిచూచి నోరుపెగల్చలేక పోయాడు మొదట. అట్లాగే గుడ్లప్పచెప్పి చూస్తున్నాడు. అసలు ఆ అమ్మాయి ఎలా రాగలిగిందా అని అతని అనుమానం. ఆయనదృష్టిలో దుర్గికూడా ఒక ఎర్రకొండలాగా కనిపించింది.

"మీకో పనుండి వచ్చానండీ." దుర్గిగొంతులోని ఉత్సాహం మాటల్లో వెల్లడవుతోంది. "మీరు వొంటరిగా చీకటిపడ్డదాకా వున్నారే యివ్వాళ. గుడ్డిగా వెలుగుతోన్న దీపం జూచి మీరున్నారనే యిటొచ్చాను."

"ఏమిటి పని?"

'నాగ్గూడా చదువు చెప్పండి. నేర్చుకుంటాను. ఫాక్టరీ పనులతో విసిగిపోయాను.'

'సరే, అయితే రేపట్నుండి రా!'

అన్నాడేగాని కామరాజు హృదయం ఎ[illegible]దుకనో ఒప్పు[illegible] కోవటంలేదు. గోకుల్ చరిత్ర అంతా తెలుసు కామ[illegible]రాజు పం తులుకు. కాని దుర్గిమాటల్లోని లాలిత్యము, రసము అ[illegible] తన్ని కాదనిపించలేక పోయాయి. ఆమెతో పాటు బయటకు నడిచాడు. బడితలుపులు బిగించి చాలదూరం దుర్గితో మాట్లాడుతూ నడిచాడు.

'అయితే దుర్గీ! ఇక నువ్వు యింటికిపో. రేపటినుండి బడికిరా' అన్నాడు చివరికి. దుర్గితో ఎంతసేపు మాట్లాడుతున్నా తనివితీరలేదు అతనికి. కాని తప్పనిసరై పొమ్మన్నాడు.

మర్నాడుదయం దుర్గి బడికొచ్చింది. చక్కగా తల దువ్వుకొని చాదుబొట్టు పెట్టుకుని ఉతికిన గుడ్డలు కట్టుకొని, చేతిలో పలక. పెదాలపై నవ్వుతో ప్రత్యక్షమయింది. ఆమెను చూచి బడిపిల్లలంతా గుసగుసలాట్టం ప్రారంభించారు. ఫాక్టరీ కూలీల పిల్లలకు దుర్గిరాక అట్టే బాధ కలిగించలేదుగానీ, బస్తీ పిల్లలలో గుసగుసలు ప్రారంభమైనాయి. ఈ విషయం వాళ్ళ పెద్దవాళ్ళకుగూడా తెలిసింది.

"దొంగముండాకొడుకు గోకుల్. వాడి కూతురు బడికొస్తే దానిసావాసంపట్టి పిల్లలంతా చెడిపోరూ!" అని చాలా మంది తమ పిల్లల్ని బడి మాన్పించారు. కొందరు కామరాజును బెదిరించారు. కాని, కామరాజు వాళ్ళపిల్లల్ని మాన్పించేందు

కైనా వొప్పుకున్నాడుగానీ, దుర్గిని వొద్దనేందుకు సిద్ధపడలేదు. క్రమంగా వాళ్ళ బెదరింపుల్లో చేవ చచ్చిపోయి, తిరిగి వాళ్ళ పిల్లల్ని బడికి పంపటం ప్రారంభించారు. అది తప్ప మరో బడి లేదు ఆ ప్రాంతాల్లో. అదీగాక కామరాజు చక్కగా చెప్ప గలడనే ప్రతీతి [illegible] చేతులా[illegible] ఎంతకాలమని బడికి పంపకుండా పిల్లల చదువు [illegible] పాడుచేస్తారుగనుక.

కాలచక్రంలో మరో మూడు నెలలు తిరిగాయ్. వాతావరణం ప్రశాంతంగానే ఉంది. ఒకరోజు చీకటిపడ్డతరువాత కామరాజు బడిలో కూర్చుని చదువుకుంటున్నాడు. దుర్గి వొచ్చింది. "ఏం దుర్గీ యిప్పుడొచ్చావ్?" అని అడిగాడు పంతులు. కాని, దుర్గి చక్కగా అలంకరించుకుని ప్రయాణ సన్నాహంలో ఉంది. 'రాండి' అంది.

కామరాజు ఆమెతోపాటు బయల్దేరాడు. ఆమె రమ్మంటే కాదనలేకపొయ్యాడు. ఎక్కడికి పోవటమో తెలీదు. కాని కాళ్ళు నడుస్తోనే ఉన్నయ్. స్టేషన్ దాటి పట్టణంలోకివచ్చారు. హోటళ్ళు, హాస్పిటళ్ళు అన్నీ వెనక్కు నడుస్తున్నాయి. దుర్గిని ఎరిగున్నవాళ్లు కొందరు దోవ తొలిగారు. కొందరసహ్యించుకున్నారు.

మరి ఒకమైలు నడిచారు యిద్దరు. ఇద్దరిమధ్య మాటా పలుకుల్లేవు. పట్టణం దూరాన చీకట్లో గుడ్డిదీపాల పండగ్గా ఉంది. నదీ తీరాన అరమైలు నడిచారు. ఆవలవొడ్డుకు పోవాలి. ఆ నిండు నదిలో ఒడ్డు పెళ్ళలు విరిగి పడుతున్నాయి. ఒక చిన్న పాయనుదాటి ఎర్రకొండ సమీపించారు. కొండ కొసకు చేరుకున్నారు. అదే సమయంలో యింకా చాలామంది ఉన్నా

రక్కడ. జనం గుంపుగా చూస్తున్నారు. గుంపును తోసుకుని దుర్గి లోపల దూరింది. కామరాజు దుర్గిని అనుసరించాడు. 'అడుగో నాన్న' అంది దుర్గి. దూరాన గోకుల్ శవం, శవం ప్రక్కనే తుపాకి కనిపిస్తోంది. ఆ తుపాకితోనే నాన్న కాల్చుకు చనిపోయింది.

♦ ♦ ♦

ఎండాకాలం. సాయంకాలం ఒకరోజు కామరాజు షికారుగా బయల్దేరాడు చాలాదూరం. ఒక పెద్ద తోట అడవిగా వుంది చూట్టానికి. అందులోంచి పోతూన్నప్పుడు దుర్గి కంఠం వినిపించింది. విని 'దుర్గీ!' అని పిలిచాడు. చెట్ల గుబుర్ల లోంచి వొచ్చింది దుర్గి. "నువ్వుగూడా షికారొచ్చావా?" అవునన్నట్లుగా తలూపిందిగాని అదే తన నివాసం అని చెప్ప సాహసించ లేకపోయింది.

బడిలోకి క్రొత్తగా కమల అనే అమ్మాయి వచ్చింది. దాదాపు దుర్గి వయస్సే. అట్టే అందంగా వుండదు గానీ, చిలిపిగా వుంటుంది. అందర్నీ ఆకర్షిస్తుంది. కామరాజుపంతులు కమలతో చనువుగా వుండటం దుర్గి సహించలేకపోతోంది. ఇంతకాలం తనతో అన్యోన్యంగా వుంటూన్నపంతులు ఇప్పుడీ కొత్తావిడతో స్నేహంగా మాట్లాడటం దుర్గికి ఈర్ష్యగానే వుంది.

ఒకరోజు ఉదయం దుర్గి బడికి రాలేదు. మధ్యాహ్నం వచ్చేసరికి పంతుల్లేడు. "ఏడీ?" అంటే కమలతో కలిసి బయటకు వెళ్లాడని తెలిసింది. దుర్గి కళ్లలో కోపం మూర్తీభవించింది. ఏదో కాగితంమీద వ్రాసిపెట్టి వొచ్చేసింది. మళ్లీ

బడికి వెళ్ళలేదు. పంతులు వొచ్చి చూసుకునేసరికి దుర్గి వుత్త
రం. ఆత్రంగా విప్పి చూచాడు.

"పంతులుగారికి —

ఇకనుండి బడికి రాను. అసలు మీకు కనుపించను. మీకు దూరంకావాలని వెళ్ళిపోతున్నాను. నా వియోగానికి మీరేమీ చింతించకండి. కాని, కమలనుమాత్రం నమ్మకండి.
—"దుర్గి"

ఉత్తరం చదువుకునేసరికి కామరాజు గుండెల్లో పిడుగులు పడ్డయి. ఏదీ దుర్గి? ఎక్కడుంది? ఎక్కడికి పోతే దొరుకుతుంది? ఆమె ఇల్లెక్కడో తెలియదు తనకు. వెతుకుదామంటే ఎక్కడ? ఏంచేస్తాడు పాపం. ఎవరూ చెప్పరు ఆమెజాడ. అందరికీ కోపమే ఆమె అంటే.

దుర్గికోసం వెదకటం ప్రారంభించాడు వొంటరిగా, పిచ్చిగా. మళ్లీ అడవిలాంటి తోటలోకి పోయాడు. చెట్లలోంచి గలగల శబ్దం. దాహం వేస్తోంది. నీళ్ళెక్కడ? ఎవరిస్తారు? చెట్టు మీదికి చూచాడు. దుర్గికళ్లు మెరుస్తోన్నయి."దుర్గీ"అన్నాడు.

దుర్గి పైనుండి మాట్లాడలేదు.

"రా దుర్గీ రా, నాతో పలకవూ?"

"ఉహూఁ" అన్నట్లుగా మూతి ముడిచింది దుర్గి.

"దాహం వేస్తోంది, ప్రాణం పోతోంది. రా, రక్షించు."

"న న్నంటుకోకండా వుంటే వొస్తాను."

"సరేలే"

"కాదు, ఒట్టెయ్యి"

"నీతోడు, రా, దిగిరా!"

దుర్గి చెట్టు దిగివచ్చింది. అతని కళ్లలో నీళ్లు, ముఖం నిండా దుఃఖం. ఆమె హృదయం ద్రవించింది. "నీకోసం నేనే మాయం అవుతాను దుర్గీ." దుర్గి అతని చేతుల్లో వాలిపోయింది. అతని కన్నీటి బరువును ఆమె మొయ్యలేక పోయింది. అట్లా హృదయంలో హృదయం కరగిపోయినప్పుడు వేరే నోటిమాటల్తో ఒట్లు, ఒప్పందాలు దేనికి?

♦ ♦ ♦

నేల యావత్తూ పచ్చగడ్డిని కప్పుకొంది. చెట్లు చిగురిస్తున్నయి కొత్తగా. గోకుల్ సమాధి వున్న ఎర్రకొండకు జనం తిరణాలగా పోతున్నారు. దుర్గి జీవితం సంతోషంగా, సుఖంగా గడుపుతోంది. ఆ బడిలో చదివినవాళ్లలో దుర్గిలాటి తెలివిగలవాళ్లెవరూ లేరు. ఆమెకు ఆమెయే సాటి. అందువలన గూడా కామరాజుకు దుర్గి అంటే ప్రేమ. తన కష్టానికి దగ్గ ఫలం ఆమె.

దుర్గిని కామరాజు ప్రేమిస్తున్నాడా అంటే సమాధానం లేదు. అంటే అతను ప్రేమించేమాట వాస్తవమే. కాని, ప్రేమిస్తున్నానని చెప్పడు. దుర్గిని పెళ్లిచేసుకోవాలనే నిశ్చితాభిప్రాయంగూడా లేదాయనకు.

♦ ♦ ♦

నాటకసమాజంవాళ్లు నాటకాలను వేస్తున్నారు పట్టణంలో. దుర్గి ఒకరోజు అడిగింది కామరాజును "నాటకానికి పోదాం వస్తారా" అని. అందుకు కామరాజు సమాధానం చెప్పలేదుసరికదా, పైగా దుర్గినికూడా పోవద్దన్నాడు. ఆమెకు అతనిపై కోపం వచ్చింది. "నే పోతా" నంది. "నీకంటే కమలే మంచిది,

చెప్పినమాట వింటుంది" అన్నాడు. అట్లా అంటేనన్నా ఊరు కుంటుందేమోనని. ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయిందిదుర్గి. కామరాజుగూడా ఆ ప్రస్తావన ఎత్తుకోలేదు తిరిగి.

మర్నాడుదయం బడిపిల్లలు గుసగుసలాడుకుంటున్నారు. "ఏమిట్రా అది?! అని అడిగాడు కామరాజు.

"మరండీ, దుర్గండీ, పోతోందండీ!"

'ఎక్కడికిరా, వెధవా!'

'అదేనండి, అక్కడికి'

'ఎక్కడికీ'

'నాటకానికండి సార్!'

'అంతేగదా!'

'కాదుసార్. వాళ్ళల్లో జేరిపోతోందండి. అసలీవూరు నుండే వాళ్ళతో లేచిపోతోందండి'

'నీకేం తెలుసు?'

'నాతో చెప్పింది సార్! తను నాటకాలు వేస్తాననీ, డాన్సులు చేస్తానని'

కామరాజు గుండెల్లో బండలుపడ్డాయి. తనదుర్గి తన కాకుండా నాటకాలవాళ్లతో లేచిపోవటమా? అతని బుద్ధి ఆలోచించ లేకపోతోంది. జీవితంలో దుర్గి తనను వదలిపెడు తుందని, వదలివేయగలదని అనుకొని ఎరగడు పాపం! తనంటే అమితమయిన ప్రేమతో ఉంటోందని అతని అభిప్రాయం. కాని తాను ఎల్లకాలం ముభావంగా ఉపేక్షించి ఊరుకుంటే దుర్గి తేంగాను! ఒక్కసారయినా ఆలోచించాడా? లేదే! ఆమె భవిష్యత్తును గురించి ఏకొంచె మయినా, కనీసం సానుభూతి

అయినా ప్రకటించాడా? లేదే! అయినప్పుడు అతన్ని నమ్ముకొని దుర్గి ఎందుకుండాలి?

పిచ్చిగా పరుగెత్తాడు పట్టణానికి స్టేషన్ దగ్గర్లోనే నాటకసమాజం డేరాలు. త్వరగా పోయాడు. కాపలావాడు ఎక్కడకని అడుగుతున్నా సమాధానంలేదు. "మేనేజరు ఎక్కడ? ఎక్కడ మేనేజరు?" అంటూ మేనేజరుగదిలోకి పోయాడు.

అడిగాడు మేనేజరును "మా బడిపిల్ల, పేరు దుర్గి, మీ నాటకాల్లో చేరుతానని వచ్చిందటగా?"

"అవును వచ్చింది'' అన్నాడు మేనేజరు హేట్‌తీసి టేబుల్ మీద పెడుతూ.

"మీరు వేరుగా భావించకపోతే నేనొక విషయం చెప్తాను. ఆమె ప్రస్తుతం నా పోషణలో ఉంటోంది. తల్లి, తండ్రి, అన్న, తమ్ములు ఎవరూ లేరు. ఆమెభాధ్యతలన్నీ మీరు చూడగలరా?"

"నా కదంతా తెలీదు. ఆమెకు నాటకాలంటే మంచి ఉత్సాహంవుంది. పైకి రాగల అవకాశాలున్నాయి. ఆమెకు మీరేమైనా కానీండి. నమ్మకంతో నా దగ్గర వదలండి. మిగతా విషయాలన్నీ నే చూసుకోగలను."

కామరాజు గొంతు తడబడింది ఆ మాటలు వినేసరికి. "ఓ!...ఆ అమ్మాయిని నువ్వు కాజేయాలని చూస్తున్నావల్లే వుంది. అదేం కుదరదు" అంటూ ఆ మేనేజరుతో కలబడ్డాడు. యిద్దరూ ఘోరంగా కొట్లాట ప్రారంభించారు. ప్రక్కనున్న వాళ్ళు యిద్దర్నీ విడదీశారు. కామరాజును పట్టుకున్నతను తలుపుదాకా తీసుకొచ్చి బయటకు నెట్టాడు. "చంపేసేవాణ్ణి,

వాళ్ళంతా రాబట్టి బ్రతికి పోయ్యాడు" అంటూ బజార్న పడ్డాడు కామరాజు.

బడికి వచ్చేసరికి బడితలుపులు బార్లగా తీసివున్నాయి. కిటికీ గుండా దుర్గి నల్లని వంతులజుట్టు అగుపిస్తోంది. అతని ఆశ్చర్యం ఇంత అంత అని చెప్పడానికి వీల్లేదు.

కామరాజు మనస్తత్వం అంతా తేలికైంది. దుర్గినిగురించి ఆలోచించటం ప్రారంభించాడు. అసలు దుర్గి ఎవరు? దుర్గికి తనకు ఏమిటి సంబంధం? ఎందుకు సంబంధం? ఆమెనుగురించి తనెందు కింత బాధపడవలసివచ్చింది?

ఈ ప్రశ్నలకు సమాధానంగా. చివరకు అతను కలుసుకోవలసిన దుర్గి కనుపించింది. గదిలోపల ప్రవేశించాడు. త్వరగా టేబుల్ దగ్గరకు పోయి "అమ్మాయి! లే. కొంచెం విశ్రాంతి గావాలి నాకు. ఒంటరిగా ఉండాలనుకుంటున్నాను" అన్నాడు చీకాకుగా.

దుర్గి లేచి నిలబడ్డది. కామరాజు కుర్చీలో కూర్చున్నాడు. మొఖం చేతులతో కప్పుకుని.

అరగంట ఆగి చూచినా దుర్గి అక్కడే నిలబడింది.

"ఏం అట్లా నుంచున్నావ్!" అన్నాడు కామరాజు

"అతడ్ని చంపారా?"

"ఉహుఁ!"

"చంపుతారనుకున్నాను"

"చంపుతారనుకున్నావ్! బలేమాట అనుకున్నావ్! చంపేవాళ్లే. వెధవలు అంతా అడ్డంవొచ్చారు."

"అది చెప్పేందుకే వచ్చాను. వాళ్ళతో వెళ్ళిపోదా మనుకున్నాను. కానీ, డాక్టరు చెప్పాడు. అందుకనే ఆగిపో యాను. మిమ్మలి వొదిలిపోవటంకన్న చావటంమేలు.

"దుర్గీ చాలా అన్యాయంచేశావు.'

"అలాగే అంటోండండి. అలాగే నా హృదయంలో విషం పెడుతున్నారు. పోతున్నాను. వాళ్ళలో చేరిపోతాను. అక్కడే చస్తాను విషం తిని" అంటూంటే ఆమె కళ్ళల్లోంచి రెండు నీటిబిందువులు రాలాయి.

"దుర్గీ! నాతో వుండిపోతావా?"

ఆమె చేతులు ఆయన మెడచుట్టూ తిప్పి "ఉం టాను" అంది.

"ఇవాల్టినుండే"

"ఆఁ!"

ఇద్దరూ చెట్టపట్టాలు వేసుకుని బజార్న బయలు దేరారు. కామరాజు యిల్లు యిద్దరినీ స్వీకరించింది. ఎర్ర కొండ సాక్షిగా నవ్వుకున్నారిద్దరూ తెల్లని వెన్నెల్లో!!



# పునస్సమాగమం

క్రిష్ణారావు వొచ్చాడని తెలియగానే శాంతమ్మ హృదయం బాధపడసాగింది. ఆమెకు ఒక్కసారిగా సంతోషం, ఏడుపూ వొచ్చినయ్. అల్పసంతోషం ఆ సమయంలో. అసలు ఈ మధ్య క్రిష్ణారావు విషయం పూర్తిగా మర్చిపోయిందనే చెప్పాలి. లేకపోయినట్లయితే శివరామయ్యను తిరిగి వివాహం చేసుకొనేది కాదేమో!

శాంతమ్మ క్రిష్ణారావు భార్య. అతణ్ని ప్రేమించింది. పెళ్ళిచేసుకుంది. కాని ఉద్యోగంలేని క్రిష్ణారావు చాలాకాలం బాధపడ్డాడు. కుటుంబభారాన్ని మోయలేక విసిగి వేసారి, చివరకి కట్టుకున్న శాంతను కూడా వొదిలి మిలిటరీలో చేరాడు. ఆనాడు అతను యుద్ధంలోకి పోవటానికి అంతకన్నా కారణా లేవీ లేవు. శాంతను ప్రేమించకనూకాదు, ఆమెపై విరక్తి వల్లనూకాదు. ఆమె అంటే ప్రాణాన్నయినా యిస్తాడు. కాని, అలాంటిశాంతను సౌందర్యమూర్తిగా, ఆరాధ్య దేవతలా ఎంత కాలం వుంచుకుంటాడు తిండిపెట్టలేక. అయినప్పుడు ఆమె సౌందర్యం ఎంతవరకు నిలుస్తుంది. ఎన్ని రోజులని తృప్తి పడు తుంది.

మిలిటరీలోకిపోయినా ఆమెను మరచిపోలేదు. ప్రతి నెలా కొంతడబ్బు పంపుతూండేవాడు. ప్రతివారం ఉత్తరాలు వ్రాశేవాడు. శాంత మనస్సును ఆ విధంగా బంధించాడు కొంత

కాలం. కాని యుద్ధం విజృంభించాక క్రిష్ణారావు విషయం ఎవరికీ తెలిసిందిగాదు. అతని వద్దనుండి ప్రతి వారం వొస్తూన్న ఉత్తరాలు, ప్రతినెల వొస్తూన్న డబ్బుకూడా రావటం లేదు. అందుకు కారాణాలేమిటో తెలియవు. క్రిష్ణారావుకు వ్రాసిన ఉత్తరాల్నుకూడా ఆయనికి అందకపోవడంతో అతను చసిపోయాడని తెలిసింది. మిలిటరీ అధికారులు కూడా అదే అనుమానాన్ని వెల్లడించేశారు.

శాంతమ్మపని నీళ్ళలో పడ్డ ఎలుకలా అయింది. ఇంతకాలం ఆశలు పెట్టుకునివున్న క్రిష్ణారావు చనిపోయాడు. తను బతికేందుకు? ఏ అవకాశమూ లేదు. ప్రస్తుతం తలే దండ్రీ లేని తను ఏంచేస్తుంది? కొడుకు డబ్బు పంపినంతకాలం వుంచుకున్న శాంత అత్త యిప్పుడు తనను వెళ్ళగొట్టింది. బజారు పాలైంది తను.

అసలు శాంత శివరామయ్యను పెళ్ళి చేసుకోవటం విచిత్రమైన సంఘటన. శివరామయ్య జన్మతా తనకు పెళ్ళి అవుతుందనుకోలేదు ముప్పయ్యేళ్ళ ఆయనకు ఎవరు పిల్లనిస్తారు గనక? అంతకాలం ఏవో సాకులుచెప్పి పెళ్ళి చేసుకోవటంనుంచి తప్పించుకున్నాడు. కొంతకాలం 'అప్పుడే నాకెందుకు వివాహ'మనీ, 'ఏం తొందరలే' అనీ. చివరకు ముప్పై యేళ్లు వొచ్చాక పెళ్ళిమీద గాలిమళ్ళింది. కాని, యిచ్చే నాథుడికకనిపించలేదు. అలా బాధతో, దిగులుతో రోజులు గడుపుతున్న శివరామయ్యకు శాంతమ్మ తటస్థపడ్డది.

తిండికి మాడి, అత్తకు వెగటై శాంతమ్మ దేశాంతరం బయల్దేరింది ఒక్కతే. యవ్వనంతో వున్న తను ఎవరిదగ్గరకని

వెళ్తుంది. ఏమని ఆశ్రయిస్తుంది. పుష్టిగా వయస్సులో వున్న తనను ఎంతమంది ఎన్నివిధాలుగా అనుకుంటారో! బాగా వున్నప్పుడు తను ఎంతమందిని ఎన్నిమాటలనలేదుగనక? అలాగే తననూ అంటారు. అయినా తప్పదు. మనరోజులు బాగా లేనప్పుడు తల వొంచుకొని ప్రయాణంచేయాలి! జీవితాన్ని ఎలాగో ఒక మార్గాన పోనివ్వాలి.

ఆరోజు నడిచినడిచి అలసిపోయి, రాత్రి ఎక్కడా తిండి దొరక్క నకనకలాడుతూ ఆ యింటి అరుగుమీదికి చేరింది. అప్పటికే రాత్రి తొమ్మిదిగంటలు కావొస్తూంది. బజార్న జనం నడవటంలేదు. కంట్రోలుదీపాలు గుడ్డిగా వెలుగుతున్నయ్. "అరుగుమీద రాత్రికి పడుకోనిస్తారా?" అని కేక వేసింది లోపలి వారికి వినిపించాలని. అలా బ్రతిమలాడడం, ఇతరుల మనస్సును రంజింపచేయటంకూడా చేతకాదు ఆమెకు. ఎప్పుడైనా అలవాటుంటేగా?

ఏదోపుస్తకం చదువుకుంటూ కూర్చున్న శివరామయ్య ఆశ్చర్యపడ్డాడు అంత రాత్రివేళ చీకట్లోంచి స్త్రీ కంఠం వినిపించినందుకు. తలుపు గడియతీసి తొంగిచూచాడు. చీకట్లో ఆమె అందం తెలియటంలేదు గానీ, ఆకారంమాత్రం పొడగట్టినది. అలాగే ఆశ్చర్యపడి చూస్తున్నాడు.

"రాత్రికి అరుగుమీద పడుకోనిస్తారా?" అంది శాంతమ్మ.

"ఏవూరు మీది?" అన్నాడు తడబడుతూ.

"............"

ఆమె చెప్పనందుకు అతను అర్థంచేసుకున్నాడు తన జ్ఞానంప్రకారం. "బయట చలి ఎక్కువగా వుంటుంది. లోపల పండుకోండి వచ్చి. ఫరవాలేదు"...అన్నాడు

ఆమె ఆశ్చర్యానికి అంతులేదు. కాని అదే సమయంలో అనుమానం వేధించింది. కాని ఆయన్ను దీర్ఘంగాచూస్తూ అలాంటివాడు కాదని తెల్సుకుందికూడా.

"ఫరవాలేదు. యిక్కడే పడుకుంటాను" అంది. ఆమె గొంతు దీనంగా – స్వరం హీనంగా వుంది.

"లోపలకు రండి. మీకేం అభ్యంతరం లేదు. చాప యిస్తాను. హాయిగా నిద్రపడుతుంది. అదీగాక బయట దొంగల హడావుడి ఎక్కువగావుంది వూళ్లో" అన్నాడు.

తప్పిందిగాదు. లోపలకు పోయింది. మూడు గదుల యిల్లు. బాగావుంది. ఆడవాసన ఎక్కడా తగలటంలేదు. అన్నీ ధోవతులు, చొక్కాలు, యిలాంటవేగాని, చీరలు, రవికలు లేవు దణ్ణాన.

"అలా వున్నారేం నీరసంగా" అన్నాడు శివరామయ్య పుస్తకంలోకి చూస్తూ. ఆమెవైపు గట్టిగా చూట్టానికి భయం అతనికి.

"ఆరోగ్యం సరిగా లేదండీ" అన్నది.

అతను చాలసేపు ఆలోచించాడు. ఆమెను చూచాడు. అంతలో అన్నంపెట్టేందుకు పనిమనిషి వొచ్చింది; పదే ళ్ళమ్మాయి. శాంతమ్మ చాల ఆశ్చర్యపోయింది.

"సీతామ్! ఆయమ్మగారికి స్నానంచేయించి అన్నంపెట్టు" అన్నాడు శివరామయ్య.

అతని కారుణ్యం ఆమెను పరవశురాల్ని చేసింది. ఏమను సమాధానం చెప్పలేకపోయింది. అన్నం వొద్దులెండి అందా మనుకుంది. కానీ, మాట పెగల్లేదు. ఆమె భోజనంచేసింది.

శివరామయ్యా ఆమె విషయం పూర్తిగా తెలుసుకున్నాడు. "పాపం!..." అన్నాడు. ఆమెకళ్ళల్లో నీళ్లు తిరిగినయ్. అతని హృదయం బరువెక్కింది. ఆమెమీద జాలి, దయ, కరుణ ప్రోడీకరించినయి అతని హృదయంలో.

"పోనీ, మీరు యిక్కడే ఎందుకు వుండిపోకూడదు?" అన్నాడు ఆమెకళ్ళల్లోకి లోతుగా చూస్తూ. అందు కామె అనుకున్నంతగా అభ్యంతరం చెప్పలేదు. ఆమె అలానే అనిపించింది. తనను శివరామయ్యా వివాహం చేసుకోగూడదా అని. ఆయనకూ పెళ్లికాలేదు. యితర సంసారంగానీ, బంధువులు గానీ లేరు...మంచి సంపాదన.

శాంతమ్మ శివరామయ్యాలు తూతూ మంత్రంగా పెళ్ళి చేసుకున్నారు. భగవంతుడి సాక్షిగా పురోహితునికి పదిరూపా యిలిస్తే సరిపోయింది. పెళ్ళి పూర్తయింది. వాళ్ల జీవితం సుఖంగా జరిగిపోతోంది. క్రిష్ణారావు ఆమెకి ఎప్పుడూ జ్ఞాపకం రాలేదు. రావలసిన అవసరం లేదేమో నిజానికి. స్త్రీ సుఖంగా బ్రతికి నప్పుడు గత విషయాలు జ్ఞప్తికి రాకపోవటం సహజం.

శివరామయ అయినా అంతగా వయసు ముదిరినవాడు గాదు. ముప్పై సంవత్సరాలంటే పెద్ద ముదురు లెక్కలోది గాదు. వెనకటి వాళ్లు నలభై యేళ్ళు వొచ్చినా స్త్రీ స్పర్శ లభించేదికాదు. అదీకాక శివరామయ్యా అప్పటివరకూ బ్రహ్మచారి. అన్యోన్యంగా సంసారం జరిగిపోతూంది. ఆమె

జీవితానికి ఒక దోవ చూపినందుకు శివరామయ్యను ఆమె ఎప్పుడూ అభినందిస్తుంటుంది.

శివరామయ్యను గురించి చెప్పవలసిన విషయా లనేకం వున్నయ్. అతను తెల్లని వన్నీ పాలుగా, నల్లనివన్నీ నీళ్ళుగా భావించే వ్యక్తి. శాంతమ్మమీద అభిమానమే గాదు, నమ్మకంగూడా ఎక్కువే. ఆమె అతని హృదయంలో జ్యోతి వెలిగించింది. అందుకనే అతను హృదయాన్ని ఆమెపరం చేశాడు. అందు కా శాంతమ్మ యోగ్యురాలు కాదని మాత్రం ఎవరన గలరు?

ఇప్పుడు తిరిగి క్రిష్ణారావు వొచ్చా డని తెలియగానే ఆమె హృదయం శోకించింది. పచ్చని తన సంసారంలో అగ్గి బెట్టేందుకు దాపురించిన శనేశ్వరుడుగా భావించింది. ఒక నాడు క్రిష్ణారావు తనను ప్రేమించినమాట నిజమే. కాని ఆమె జీవితం చుట్టు ముళ్ళ పొదలు నాటింది అతనే. ఆ పొద చీల్చి దారి చూపించింది శివరామయ్య. తిరిగి క్రిష్ణారావు వొచ్చాడు. ఎవర్ని ప్రేమిస్తుంది? ఎవర్ని కాదంటుంది?! విధి నిర్ణయం అనటానికి వీల్లేదు.

'మానవుడు చేయలేని పనులు విధిపైన వేయటం ఒక ఆచారమైంది. కాని శాంతమ్మకు అలాచేయటం యిష్టంలేదు. ఏదో పరిష్కారాన్ని ఆలోచిస్తో కిటికీలో కూర్చుంది. శివరామయ్య కోపంగా వొచ్చాడు. అతనికి కోపమేగాదు, దిగులు కూడాను. ఒకరి అదృష్టం మరొకరికి బందిఖానా కావచ్చు. కాదంటానికి వీల్లేదు. అదీ శివరామయ్య స్థితి ప్రస్తుతం.

"అతను వచ్చాడటగా" అడిగాడు శివరామయ్య.

"అవునన్నట్లు తలూపింది ఆమె.

ఆతరువాత అతని కళ్ళల్లోని క్రౌర్యం ఇల్లాంటిదని చెప్ప టానికి వీల్లేనిదయింది.

'అతను చాలా మంచివాడు' అన్నది శాంత.

'అయితే?'

"నాకోసం వొచ్చాడు...నే నింకా బ్రతికే వున్నానని ఆశ పెట్టుకొని వొచ్చాడు—పాపం"

"రాని...ఏం వొస్తే" అన్నాడు శివరామయ్య.

"ఆమె ఆలోచిస్తోవుంది విచారంగా.

"అతనితోనే వెళ్లి పోతావా శాంతా?" అడిగాడు జాలిగా.

"ఆతను నన్ను యిదివరకు ప్రేమించాడు"

"నేనుమాత్రం యిప్పుడు ప్రేమించటంలేదు,'

"నాకోసం అతను ప్రాణాన్నే తృణీకరించి యుద్ధంలోకి వెళ్లిపోయాడు"

"అలా అదృష్టానికి వొదిలిపోవటం ప్రేమచొప్పునేనా?"

అతన్ని ఎలాంటి సమాధానం తృప్తి పరుస్తుందో ఆమెకు తెలియడంలేదు.

"శాంతా! వాడు నిన్ను ప్రేమించటానికి వీల్లేదు. వాడేకాదు, నువ్వూ వాడ్ని ప్రేమించటానికి, వాడితో వుండి పోటానికి వీల్లేదు. నే బ్రతికుండగా అలాంటిది జరగటానికి వీల్లేదు..."

"వారు...మీరు...ఎవర్ని కాదనేది? యిద్దరూ నా కోసం..."

"శాంతా! మా యిద్దరికి పోటీ యేమిటి? ఎవరో ఒకరు నీకోసం, నీ అందంకోసం, నీ ఆనందంకోసం...బ్రతకాలి."

శాంత ఆలోచిస్తోంది దీర్ఘంగా.

"ఎప్పుడొస్తాడు?" అన్నాడు శివరామయ్య.

"వొచ్చే టైమయింది... మీరు పొండి, కొంచెం మాట్లాడతాను."

"ఎక్కడికి పోను?"

"బజారు పోయిరండి"

"అతనితో లేచిపోవటానికా నే బజారు పోగానే?"

పోను -- పోయి మీ కన్యాయం చేస్తానా? చేయను. నా మాటమీద నమ్మకం వుంచాలి. నన్ను నమ్మండి. నేను మీతోనే వుంటాను. లేచిపోను. పోలేను. అతను నాకు భర్తగాదు.

'అతను నిన్ను ప్రేమిస్తున్నాడన్నావు. యిప్పుడంతా కపట నాటకంగా మాట్లాడుతున్నావు. నన్ను మోసంచేస్తున్నావ్'

"మోసం కాదండి, నామాట నమ్మండి. నాకు కల్మషం లేదు. ఆయన్ని నేను ప్రేమించటంలేదు. యిప్పుడు అన్నీ వొదులుకున్నాను. మిమ్మల్ని ప్రేమించాను...నాకోసం, నా సుఖంకోసం పాటుపడుతూన్న మీతో అబద్ధం చెపుతానా?"

"శాంతా! అతనితో ప్రేమగా మాట్లాడటం నే సహించలేను"

"సరే..."

శివరామయ్యకు కోపం యింకా తగ్గలేదు. రహస్యంగా దాక్కున్నాడు కత్తి తీసుకొని తనభార్యను తీసుకుపోదలచుకున్న క్రిష్ణారావుమీద కసి తీర్చుకునేందుకు.

శాంత విచారానికి అంతులేదు. ఈ జీవన్మరణ సమస్య తేలకుండావుంది. ఏంచేస్తుంది.

"శాంతా...శాంతా!" ఎంతో సంతోషంతో క్రిష్ణారావుకి తలుపుతీసింది. లోపలికి వచ్చాడు క్రిష్ణారావు.

"శాంతా, వొచ్చాను శాంతా...నీకోసం. అయ్యో సంతోషంగా లేవా? నే వచ్చానని విచారిస్తున్నావేం...

'ఆరోగ్యంగా వున్నారుగదు" అంది. కాని ఆమెలో విచారం ఏమాత్రం తగ్గటంలేదు. ఆమె హృదయం శోకిస్తోంది. కళ్లుమాత్రం నవ్వేందుకు ప్రయత్నిస్తున్నాయ్.

"శాంతా! ఇలారా" అని దగ్గరకు తీసుకోబోయాడు క్రిష్ణారావు.

"ఆగు!" అన్న కఠోరశబ్దం వినిపించింది. శాంత వెనక్కు తగ్గింది.

"ఎవరూ?" అన్నాడు క్రిష్ణారావు.

"వారే" అన్నది శాంత.

పరిస్థితి అర్థమైంది క్రిష్ణారావుకి. ఒక్కసారిగా నిట్టూర్పు విడిచేడు.

"శాంతా నన్ను మరచి పోయావా?" అన్నాడు.

"అవును...తిరిగి యివ్వాళే జ్ఞాపకానికొచ్చింది" అంది.

అతనికి చాలా విచారం కలిగింది ఇంతకాలంలోను జ్ఞాపకం రానందుకు. అలాంటి తను ఆమెను...ఛీ! ఛీ! ఒక్క సారిగా నమిలేడు క్రిష్ణారావు.

"ఎందు కలా నవ్వుతావ్" అన్నాడు శివరామయ్య.

"ఈనాటికి నే నవ్వగలుగుతున్నాను."

"నీకు నవ్వుగా వుందా?"

"కాదు, నవ్వొస్తుంది."

"ఊ..." అన్నాడు శివరామయ్య.

"శాంతా..." అన్నాడు క్రిష్ణారావు.

"ఏమిటి?" అన్నాడు శివరామయ్య మధ్యలో.

క్రిష్ణారావుకు నవ్వొచ్చింది. శివరామయ్యకు అత డెందుకు నవ్వుతున్నాడో అర్థం కావటంలేదు.

శాంత హృదయం పిరికిపడుతోంది. తనస్థితి ఏమవుతుందోనని కాదు గాని, క్రిష్ణారావుగతి ఏమిటా అని. తను పూర్తిగా తెగ తెంపులుచేసి చెప్పేసింది 'నీమీదనాకు మమకారం లే' దని. పాపం! అతనిహృదయం ఎంతగా బాధపడుతోందో! ఎంతగా పరితపిస్తుందో. బలవంతాన తనను తీసుకు వెళ్ళడుగదా! శివరామయ్య......అబ్బ!

క్రిష్ణారావు ఒక్కసారి నిట్టూర్చి అన్నాడు, శాంత మొఖంలోకి,శివరామయ్య ముఖంలోకి ప్రాశ్నికంగా చూస్తూ.

"శాంతా...నే వెళ్ళిపోతున్నాను. నీవు యింకా వెనకటి నా శాంతవనే అనుకున్నాను. కాని కాదు, నీలో ఎన్నడూ రాదనుకున్న మార్పు వచ్చింది. నీవు నాకొద్దు. నిజం.నామాట

నమ్ము. నీమీద నాకు కసీ, కోపం ఏవీ లేవు. మరోపరిస్థితిలో అయితే కోపం వచ్చేదేమోకానీ, యిప్పుడు రావటంలేదు. నిర్మలంగావున్న నీ జీవితసరస్సులో మట్టిపెళ్ళవేసి కలచడం నా పనిగాదు. నాకున్నజ్ఞానం అందుకు పురికొల్పదు. నీ సుఖం కోసమే నేనింతకాలం యిన్నికష్టాలు పడ్డాను. కానీ యిక సుఖం అనుభవిస్తాను. యింతకాలం విశ్రాంతి లేకపోయింది జీవితానికి... శాంతా! సుఖంగా జీవించు, అదే పదివేలు...వొస్తా... అంటూ వెళ్ళిపోయాడు.

అతని మాటలు ఎంతవరకు నమ్మాలో శివరామయ్యకర్థంకాలేదు. శాంతలో వొచ్చే మార్పులకోసం ఎదురుచూస్తున్నాడు. కష్టారావు పోయిన త్రోవనే చూస్తూ, అతనుపూర్తిగా కనుచూపుమేర దాటగానే ముఖం చేతులతో కప్పుకుని ఏడ్వనారంభించింది.

'శాంతా... శాంతా... నేను' అంటూ శివరామయ్య లాలించడం మొదలెట్టాడు. అతని హృదయం నిర్మలమైంది.

# యుగసంధ్య

మానవుడు ఎప్పుడూ కొన్ని కట్టుబాట్లకూ, నీతి నియమాలకూ లోబడి వుంటాడు. అవి దాదాపుగా వ్యక్తిపైన బలవంతంగా రుద్దినవే అయివుంటాయి. సాధారణంగా అంతా సంఘ నియమాలకూ, కట్టుబాట్లకూ లోబడే వుంటారు. అలా కాక ..

'నేను వ్యక్తిని ఎదిరిస్తాను. వ్యక్తుల సమూహమైన సంఘంతోగూడా నాకు సంబంధం ఏమాత్రం అవసరం లేదు' అంటారనుకోండి. సంఘం మిమ్మల్ని వెలేస్తుంది మొదట. తరవాత మీ ప్రశంసే ఎత్తదు. అప్పుడు మీరు కటిక పేదలైతే అణగదొక్కుతుంది కాక భాగ్యవంతులయితే మౌనంగా వూరుకుంటుంది. లేకపోతే గొప్పచేస్తుంది. డబ్బును చూసి గొప్పచేసినసంఘం మీరు ఏపనిచేసిన ఆమోదిస్తుంది. మీరు వ్యభిచరిస్తే సహిస్తుంది. మీ పిల్లలకి వర్ణాంతర వివాహాలు చేస్తే అంగీకరిస్తుంది. మరేం చేసినా నోరెత్తదు.

♦ ♦ ♦

సోఫాలో కూర్చుని తల్లీ కూతుళ్లు మాట్లాడుకుంటున్నారు. బ్లూలైటు వెలుగు గదినిండా చిమ్ముతోంది. కుర్చీలు, టేబుల్ ఇతర ఫర్నిచరు పాశ్చాత్యపద్ధతిలో అమర్చబడివుందది అందంగా. తలుపులోనుంచి బయటకు పారిపోవటానికి ప్రయ

త్నిస్తోంది నీలికాంతి. కాని ప్రక్కనే వున్న క్రోటనులు, దూరంగా వున్న మెట్లు పోనీయటంలేదు. లోపల ఒక పక్కగా మేడపైకి మెట్లు.

వాళ్ళ కంఠాలు అస్పష్టంగా వినిపిస్తోన్న ప్రశాంత వాతావరణాన్ని చీల్చుకుంటూ. ఆకాశంలో వెన్నెల వెలుగుల్ని కప్పు కున్న మేఘాలు కిటికీగుండా కనిపిస్తున్నాయ్. కొబ్బరిఆకుల్ని చీల్చుకుంటూ వెన్నెల లోపల ప్రవేశిస్తోంది.

రాజమ్మకు కూతుళ్ళంటే మహాయిష్టం. అందుకు కొడుకులు లేకపోవటంకూడా ఒక కారణం గావచ్చు. ఒకవేళ కొడుకులున్నా కూతుళ్ళకు ఆపాటి ప్రత్యేకత యిచ్చేదేమో, మరి ఎవరు చెప్పగలరు? కూతుళ్ళంటే ప్రేమలేని తల్లులు ఎవరుంటారు గనుక.

రాజమ్మకు పుత్రసంతానం లేనిమాట వాస్తవమే. ఐతే అదొక లోటుగా భావించలేదు ఆమె. ఆ యిద్దర్నే కూతుళ్ళనుకున్నా, కొడుకులనుకున్నా. వాళ్ళే కొంచెంసేపు లాగులు వేసి, షర్టులు తొడిగి మగపిల్లల్లా కనిపించేవారు. అంతలో ఆడపిల్లలై లంగాల్లో వోణీల్లో అగుపిస్తుంటారు.

రాజమ్మకు పిల్లలంటే మహా మోజు. తన కాలం యావత్తూ వారిని ముస్తాబుచేయటంలోనో, సేవచేయటంలోనో వినియోగిస్తుంది. అదిగాక వేరే చేయవలసిన పనులుమాత్రం ఏమున్నాయిగనుక!

భర్త బ్రతికున్న రోజుల్లో - బాగా వయసులో వున్నప్పుడు - అసలు రాజమ్మ చిన్ననాటి చరిత్ర తమాషాగా వుంటుంది.

రాజమ్మ అంతగా చదువుకున్న వ్యక్తిగాదు. అసలు మొదటినుండీ చదువుకోవాలనే కోరికే వుండేదిగాదు. పట్టి బలవంతాన పెద్దవాళ్లు బడికి పంపితే సీతాపతిగాడితో తిరుగుతుండేది. సీతాపతయినా పరాయివాడు కాడు గనక సరిపోయింది. అయినా అప్పుడప్పుడు తల్లి మందలించేది.

రాజమ్మ పెద్దదయినా సీతాపతితో తిరగటం మానిందిగాదు. వెనకటిలా పొలాలవెంట, గట్లవెంట తిరక్కపోయినా, తోటలోమాత్రం తప్పక కలుసుకునేవాళ్లు. అసలు రాజమ్మను బడికి మానిపించటం యిబ్బందయింది వాళ్ళకు. కలుసుకోటానికి అదో వంక పెట్టుకుని అనుకున్న సమయానికి తోటలోకి చేరుకునేది నెమ్మదిగా, ఏదో పని వున్నట్టు. అతనూ అదే సమయానికి అక్కడికి చేరుకునేవాడు. ఒకటే గుసగుసలు, చెవులు కొరుక్కోటాలు. అట్లా రోజులు గడిచిపోతూ వున్నాయ్.

రాజమ్మకు పెళ్ళి చేయాలనుకున్నారు. అనేక సంబంధాలుకూడా వచ్చినయ్. డబ్బున్నవాళ్లు, పొలాలున్నవాళ్లు, మేడలున్నవాళ్లు అనేకమంది వచ్చారు సంబంధానికి. కాని, ససేమిరా నే చేసుకోనని మొండికెత్తింది రాజమ్మ. గత్యంతరం లేక చాలాకాలందాకా పెళ్లిప్రయత్నాలు ఆపారు తలిదండ్రులు. కాని రోజులు గడుస్తున్నకొద్దీ, ఏళ్ళు పైబడుతున్నయ్గాని తరగటంలేదు. అందులో నలుగురూ ఏమన్నా అనుకుంటారేమోననే భయం ఒకవైపు, వుండివుండీ రాజమ్మ కొంపముంచుతుందేమోనన్న భయం ఒకవైపు– ఇన్ని భయాల మధ్య ఆమ యిష్టం లేకండా ఒక సంబంధం స్థిరపర్చారు.

లగ్నంరోజు - విడిదివారు వచ్చి దిగారు. మంగళస్నానాలకు ఏర్పాట్లు జరుగుతున్నయ్ ఒకప్రక్క——ఒకప్రక్క పెళ్లికూతురు కనిపించడంలేదంటే కనిపించడంలేదని వెతికారు ఇంటిల్లిపాదీ మాయమైందంటే మాయమైందన్నారు. విచిత్రం - ఆరాతీయటం ఎవరికీ చేతకాలేదు. ఈ వార్త విడిదియింటి దగ్గర వూదా రెవరో. అంతా గల్లంతుగా వెతకటం ప్రారంభించారు. బావులు, చెరువులు, తోపులూ, పొలాలు ఎక్కడా కనిపించలేదు. పెండ్లికొచ్చిన పెద్దలు నానా మాటలూ అని వెళ్లిపోయారు.

రాజమ్మ తలిదండ్రుల దుఃఖానికి అంతులేదు. భోరు భోరున యేడవడం సాగించారు. అసలు ఆ పెండ్లి రాజమ్మకి యిష్టంలేదనీ, తామే బలవంతంగా తలపెట్టామనీ, ఈ ముదనష్టపు పెళ్లి మొదట అనుకోకపోయినా కూతురు దక్కేదేవనీ, నిక్షేపంగా సీతాపతికిచ్చి వేస్తే ... అనుకున్నారు.

సీతాపతి విషయం జ్ఞాపకం వచ్చేటప్పటికి రాజమ్మ దొరికినంత సంతోషం కలిగింది. తీరా ఆరాతీస్తే అతను వూళ్లో కనిపించలేదు. పైగా యింట్లో పోట్లాడి రెండువేల రూపాయలు తీసుకుని చెప్పకండా పారిపోయాడనికూడా తెలిసింది. ఇంకేం యిద్దరూ కూడబలుక్కునే యింతపనీ చేసివుంటారని పెద్దలు తీర్మానం చేసుకొన్నారు.

రాజమ్మ తెలివైందిగనక ఆ పట్టున పట్నం చేరుకుంది సీతాపతితోసహా. ఓ పెద్దమేడ అద్దెకు తీసుకుని కాపురం పెట్టించింది. ఓ గొప్ప ప్లీడరు సలహాప్రకారం సీతాపతి తండ్రి మీద దావా వేశాడు భాగంకోసం. మూడో నెలకల్లా భాగం

దొరికింది. ఈలోపుగా సీతాపతిగారి దూరపు వారను లెవరో చచ్చి మరో ఇరవై వేల ఆస్థి చూపించింది. వీటన్నిటితో సీతాపతి, రాజమ్మల అదృష్టం ఘనమని నవ్వింది.

సీతాపతి చనిపోయేనాటికి రాజమ్మకు యిద్దరు పిల్లలు. కూతుళ్ళంటే గారాబం గనక, చాలాకాలం వరకూ బడికి పంపకుండా ప్రైవేటుగా చదువు చెప్పిస్తూవచ్చింది. కాని హైస్కూలుచదువులు, పెద్దచదువులాయె మరి, బడికి పంపక తప్పిందిగాదు.

పెద్దకూతురు సరోజిని కాలేజీలో చదువుకోందియిప్పుడు. రెండో కూతురు యింకా చిన్నదే. పదేళ్లుంటాయి. రాజమ్మ తన పూర్వ చరిత్రను కథలాగా చెపుతూంటుంది కూతుళ్ళకు. ఎప్పటికప్పుడు ఆ కథ రుచిగా, హాయిగా వుండేది వింటానికి. అది చెప్పటంలో నేర్పు, కథలోని బిగువు వాళ్ళను బాగా ఆకర్షించేది.

ఇప్పటికీ రాజమ్మ ఆ యింట్లోనే వుంటూవుంది కూతుళ్ళతో సహా. భర్త బ్రతికున్న రోజుల్లోనే మంచి పలుకుబడి సంపాదించుకుంది గనక, ఆయనగారు పోయినా నిలబడగలిగింది పదిమందిలో గౌరవంగా. నిజంగా చూస్తే ఎవరితోటీ సంబంధము వుండనవసరం లేదు ఆమెకు. చేతినిండా సొమ్ము. లోటేమీ వుండేదిగాదు యితరుల సహాయం, సలహా లేకపోయినప్పటికీ. కాని రాజమ్మ వూరుకుంటేగా! భర్తకాలంనుంచీ వస్తున్న స్నేహితులను- అటు భర్తకు సంబంధించిన వారినీ, ఇటు తనకు సంబంధించిన వారినీ పోకుండా పట్టుకువస్తోంది.

స్నేహితులు అధికంగా వస్తూ పోతూ వుండే సంసారం. పైగా ఆమెకూతుళ్ళు చదివేది యింగ్లీషు. స్నేహితుల కేం తక్కువ. పిలిస్తే పలుకుతారు. అటు ఆడపిల్లలు, యిటు మగ పిల్లలూ స్నేహితులు సరోజానికి.

రాజమ్మగారు కూతురుతో మాట్లాడుతున్న విషయం కొంత రహస్యం. అసలు ఆమె సంసారానికి దాచుకోదగ్గ రహస్యాలంటూ ఏమీ లేవు. చూచేవారికి మాత్రం రహస్యంగా కని పిస్తుంది. కాని అవి కుటుంబానికి సంబంధించిన కొన్ని మామూలు సమస్యలు. వాటినే రహస్యాలుగా వాడుకుంటారు చాలామంది సామాన్యంగా.

రాజమ్మ సంఘాన్ని గురించీ, నీతిని గురించీ బాగా తెలు సుకున్న వ్యక్తి. సంఘంలో నీతిపేర జరుగుతున్న మోసం, అవినీతి, కుళ్ళు అంటే ఆమెకు తగని చీదర. ఆమె పూర్తి సంస్కార వాది మాత్రం కాకపోయినా, బూజుపట్టిన, సనాతన ఆచారాలంటే అసహ్యం. అన్నిటికన్నా ముఖ్యంగా డబ్బు కున్న విలువ బాగా తెలుసుకుంది. దాంతో చేయలేని పనంటూ లేదు ఆమెకు. అందుకనే కూతుళ్ళనూ తనలాగానే పెంచుకోంది. వాళ్ళు కోరినవాటికి అభ్యంతరం చెప్పదు. తన కిష్టమైనంత మాత్రాన వాళ్ళను అనుసరించమని బలవంత పెట్టదు.

కూతురు పెండ్లివిషయమై ప్రస్తావన. రాజమ్మ అడిగిన విషయాలకు సరోజిని సరిగ్గా సమాధానం యివ్వలేదు. పైపెచ్చు రాజుతో స్నేహం కొంతవరకూ తగ్గించుకోమ్మని

రాజమ్మ సలహా యిచ్చింది. అందుకు సరోజినికి కోపంవచ్చింది

♦ ♦ ♦

వస్తున్న సవ్వడినిబట్టి రాజేనని యిద్దరూ గ్రహించారు. రాజమ్మ ఆ ప్రస్తావన ఆపింది. లోపల్లోపల ఆలోచించుకుంటోంది. ఇలాంటి స్నేహితులే చివరికి మోసంచేసేదని ఆమె వూహ. సరోజిని రాజుతో కలిసి మేడపైకి వెళ్ళిపోయింది.

రాజుది మొదట ఓ పల్లెటూరు. అతను తలిదండ్రుల్ని కూడా ఎరగడు పాపం. రాజు రెండేళ్ళ కుర్రాడుగా వున్నప్పుడే తల్లి చనిపోయింది. భార్యపోయిన దిగులుతో అతని తండ్రికి పిచ్చెత్తిందనీ, ఆ తరవాత సన్యాసుల్లో కలిసిపోయాడనీ. అదిజరిగి యిప్పటికి పదిహేడు పద్ధెనిమిదేళ్లు అవుతుందని అంటారు. పోతే రాజును పెంచింది దగ్గిర బంధువుగా వున్న ఒక ముసలావిడ. ప్రస్తుతం రాజు పట్నంలో చదువుకొంటున్నాడు. తండ్రికి సంబంధించిన ఆస్తి తాలూకు డబ్బును తెచ్చుకుని కాలం గడుపుతుంటాడు. అతన్ని పెంచిన ముసలమ్మ అతను పుట్టిన వూళ్ళోనే యింటిని కనిపెట్టుకుని వుంటోంది యిప్పటికీ.

రాజుది మంచి విగ్రహం. క్లాసు మొత్తంలోకే తెలివిగలవాడని ప్రసిద్ధి. చక్కగా నాటకాల్లో వేషం వేయగలడు కూడాను. ఏ కోశానా దురభ్యాసాలు, చెడుతిరుగుళ్లు ఎరగడు కనకనే సరోజిని అతని స్నేహాన్ని వాంఛించింది. రాజు భోజనం హోటల్లోనన్నమాటేగాని వుండటం రాజమ్మగారింట్లోనే. అదీకాక సరోజినికి తోటవిద్యార్థి.

సరోజినికి అప్పుడప్పుడు అతనిమీద మమకారం పుట్టుకొస్తుంది. కాని ధైర్యంచేసేదిగాదు. ఒకసారి తనని పెండ్లి చేసు

కోమని అడుగుదామనుకుంది. అసలు తనంటే యిష్ట ముందో లేదో? ఏరోజుకారోజు అతన్ని అడగాలనుకుంటుంది కాని, ధైర్యంచేసేదిగాదు. తనతల్లితో మనసులోని మాట విప్పిచెప్పదామనుకుంటే సిగ్గుదొంతరలు ఆమెను ముంచేవి. తను చేయబోయే పనిలో, వ్యూహాల్లో ఏమీ పొరపాటు పడటంలేదనే ఆమె నమ్మకం. అయినా ప్రేమించింది. పెళ్లి చేసుకోవాలనుకుంటోంది, అయితే? అతని యిష్టంకూడా అవసరమే. అయినా మగవాడికి ఎంతలోకి వస్తుంది ప్రేమ.అసలు మగవారికి ఏదైనా తొందరే!

రాజు అందాన్ని చూసి ప్రేమిస్తోందా తను? అయితే అతనికంటే అందమయినవాళ్ళు ఎంతోమంది తనని భార్యగా కోరారు! ధనమా? అతనికన్న తనకే ఎక్కువవుంది. ఇద్దరూ ఒకేతరగతి. మరి అతను తనకంటే ఎట్లా ఎక్కువైనట్లు? అన్నింటిలోనూ గొప్పగానే కనిపించేది తనమట్టుకు తనకి; అందువల్లనే అతనిమీద మాటపడ్డా, నిందపడ్డా తను అంతగా బాధపట్టానికి కారణం.

♦ ♦ ♦

పొద్దుపోయింది. రాజమ్మ ఎదురుచూస్తోంది ఎవరి కొరకో! ఎంతసేపటికీ ఎవరూ వస్తున్న చప్పుడు లేదు. గడియారం పదకొండు గంటలు చూపుతోంది. నిద్ర రాకపోయినా మత్తుగా వుంది. పిల్లలు చదువుకొనేందుకు మేడపైకి వెళ్ళారు. తాను ఒంటరిగా క్రింద అంతస్తులో నీలం వెలుగులో కూర్చుని ఆలోచిస్తోంది. దూరంగా బయట వెన్నెల కురుస్తోంది...

తలుపు గడియ వేసి పడుకుందామని గడపదగ్గరకు వెళ్లింది. కొంచెంసేపు నిలబడి బజారులోకి చూస్తే, సైకిల్ వస్తున్న చప్పుడు మరి కొంచెంసేపటికల్లా వాకిట్లో ఆగింది. ఆ వచ్చిన వ్యక్తి లోపలికి సైకిల్ చేరుస్తో—

"ఏం రాజూ! అలా వున్నావేం!" అన్నాడు ఆప్యాయంగా.

రాజమ్మ ఏమీ మాట్లాడలేదు. బయటితలుపు గడియ వేసి వచ్చింది లోపలికి.

ఆమెవాలకం చూసి తిరిగి ప్రశ్నించాడు. 'ఏం చెప్పవ్! అలా వున్నావేఁ! చెప్పు!' అంటూ ఆమె కూర్చునివున్న సోఫాలోకి వచ్చి కూచుని లాలనగా కళ్ళంల్లోకి చూస్తూ అడిగాడు. రాజమ్మ ఏమీ సమాధానం చెప్పలేదు. అతని కళ్లల్లోకి చూస్తూ 'ఏంలేదు డాక్టర్' అన్నది. డాక్టరు కొంచెంసేపు మాట్లాడించకుండా స్థిమితంగా వుండనిచ్చాడు.

డాక్టరు రాజమ్మసంసారానికి డాక్టరుగానే పరిచయమైనాడు మొదట. అది ఆమె భర్త వున్నప్పుడే. భర్తకు జబ్బుగా వున్నప్పుడే మందు వాడటం ప్రారంభించాడు. రాజమ్మభర్తను శతవిధాలా బ్రతికించాలనే చూశాడతనూ. కాని అతనికి ఆయుర్దాయం లేకపోతే తనేంచేస్తాడు? తనేం ప్రాణం పోయగలడు గనకనా?

రాజమ్మభర్త చనిపోయిననాటినుండీ డాక్టరు ఓకంట ఆమెను కనిపెడుతున్నాడు. ఆమె నెదుర్కొనే కష్టసుఖాల్లో భాగం పంచుకునేందుకు ప్రయత్నిస్తూంటాడు. ఆమెకుగూడా చెప్పుకోదగ్గ బంధువులు- తనవైపువాళ్ళుగాని, భర్తవైపువాళ్ళు

గాని లేకపోబట్టి. పైకిరావాల్సిన పిల్లలున్నారుగనుక ఆయనగారి సలహాలు పాటిస్తూవచ్చింది చాలాకాలం.

ఇప్పటికీ అంతే. ఆయన డాక్టరుగారు గనుక, పగలు తీరిక వుండదుగనుక రాత్రిళ్ళుమాత్రమే వస్తూపోతూంటాడు.

డాక్టరుగారు రాజమ్మ యింటిమనిషిక్రిందనే జమ. ఈ విషయం పిల్లలకూ తెలియకపోలేదు.

...డాక్టరుగారు చాలాసేపు వుండి వెళ్ళిపోయారు బైటికి. రాజమ్మ ఒక్కతే తిరిగి తలుపు గడియవేసుకొని పండు కుంది సంతృప్తిగా. పన్నెండుగంట లయింది. ఆమె మనస్సు సరిగా లేదు. తనెట్లు ప్రవర్తిస్తున్నదీ అందరికీ తెలుసు. తనను చూసి పిల్లలు చెడిపోతారేమోనని ఆమె భయం. ఏదో వాళ్ల నయినా ఒక యింటివాళ్లను చేద్దామని ఆశ. కాని ఎక్కడా అందిరావటంలేదు సంబంధాలు. తను తలుచుకొంటే చాలా సంబంధాలు కొనగలదు. కాని ఈడూ జోడూ, యిష్టా యిష్టాలు, పిల్లలకి నచ్చేటాలో?

రాజమ్మ మేడపైకి వెళ్లింది. లైటు వెలుగుతూనేవుంది. సోఫాలో కూర్చుని రాజు చదువుకుంటున్నాడు. ప్రక్కగా మంచంపై సరోజిని- పుస్తకం గుండెకానించుకుని నిద్రపో తోంది నిశ్చింతగా. మెత్తని జుట్టు మంచంమీద చిందరవంద రగాపడివుంది. సుశీల అవతలగా బెడ్ మీద పండుకుని నిద్రపో తోంది. రాజమ్మ రావటం అతను గుర్తించలేదు సీరియస్‌గా చదువుకుంటూ.

రాజమ్మకు ఏంమాట్లాడాలో తోచలేదు. ఇంత అర్ధ రాత్రివేళ ఒంటరిగా వున్నప్పుడు పలకరించక పోతే ఏమనుకుం

టానో? తనను అనుమానించడుగదా? ఛీ! అన్నీ పాడు వూహాలు. ఏమిటి తన కీ విపరీతం! అనవసరంగా ఆ అబ్బాయిని అనుమానించటం – తన మెతకదనాన్ని నిరూపించుకోవటం? రాజమ్మకు సిగ్గేసింది. తిరిగి వెళ్లిపోతోంది తొందరగా.

రాజమ్మ కాళ్ళతొందర రాజుని మైకంలోంచి జాగృతిలోకి తీసుకొచ్చినది. చూచాడు. రాజమ్మగారు! అతను నమ్మలేక కళ్ళు నులుముకు చూచాడు. రాజమ్మగారేనా? అయితే ఎందుకొచ్చింది? అసలు వచ్చి ఎంతసేపయిందో! ఎప్పుడూ తను వుండగా రాలేదు పైకి. అతనిలో ఆత్రుత ఎక్కువైంది. తొణికిసలాడే కంఠంతో—

'ఎవరూ? రాజమ్మగారా?'

రాజమ్మ వెనుతిరిగి చూచింది.

'మీరేనా! ఎవరోనని చూస్తున్నాను లెండి!' అన్నాడు రాజు నిమ్మళం తెచ్చుకొంటూ.

'నేనే!' అన్నది ఆగి.

'ఏదోపనిమీద వచ్చినట్లున్నారూ? అమ్మాయిని లేపమంటారా?' ఎంత చనువు అమ్మాయి మీద అతనికి!

'అవుసరంలేదు నాయనా!' అని అట్లాగే నిలబడివుంది.

అలాగే నిలబడి వున్నారే? రాండి కూచుందురుగాని.'

రాజమ్మ దగ్గరకు వచ్చింది. తీక్షణంగా చూస్తోంది, సిగ్గుతెరల్ని తొలగించుకుంటూ.

'ఓ పదినిమిషాలు క్రిందికి రా—'

'ఇప్పుడా!' అన్నాడు రాజు దిమ్మరపోయి.

'ఊ, కొంచెం మాట్లాడాలి.'

ఇద్దరూ మేడ దిగారు. సోఫాలలో ఎదురెదురుగా కూర్చుని వున్నారు. ఎవరు ముందు పలకరించాలో ఎవరికీ తెలియటంలేదు. మాట్లాడాలని తీసుకొచ్చిందేగాని, ఏం మాట్లాడాలో అర్థంగావటంలేదు పాపం రాజమ్మకు. రాజు అలాగే కూర్చొని వున్నాడు ఆమెవైపు చూస్తూ—ఎప్పుడు ఏం అడుగుతుందో నన్న ఆత్రుతతో.

'రాజూ!'

రాజు వులిక్కిపడి చూశాడు ఆమెవైపు.

ఆమె తల వొంచుకునేవుంది యింకా.

'ఏమండీ?'

'ఓ పెద్దవిషయం నాయనా! బాగా ఆలోచించి చెప్పు.

'అలాగే, అడగండి.'

'అంతేగాదు. జీవితాంతం వరకూ సంబంధించి వుండే సమస్య. ముందు వెనకలు బాగాఆలోచించాలి చూచావూ?'

జీవితాంతం ఆలోచించవలసిన విషయాలు గానీ, ఆ సంబంధమైన సమస్యలుగాని అతని కేమీ లేవు నిజానికి. తల్లీ, దండ్రీ, దైవం ఎవరూ లేరు బాధించేందుకు. అదే రాజుకీ అనుమానం. ఏమిటి రాజమ్మ అడగబోయేది? తన జీవితాంతానికి సంబంధించిన విషయా లేమిటి

'ఏమిటి చెప్పండి—చెపుతాను' అన్నాడు.

'ఇదేం కొత్తవిషయ మేమీకాదు రాజూ! నీకూ తెలిసిందే.

దీంతో రాజు మరీ తికమకలో పడ్డాడు. ఏమిటో తనకీ తెలుసట! మరీ ఆశ్చర్యం.

'నాకేం అర్థంగావటంలేదు మీ రనేమాటలు. చెప్పండి. ఏమిటి?' "ఏముంది రాజూ - జీవితం అన్నాక అందులో ఆడ వారి సంగతి అడిగేదేముంది. చెప్పు? నేనూ పెద్దదాన్నయి పోతున్నాను. అయినా కాకపోయినా ఏ యీడప్పుడు ఆ ము చ్చట్లు జరిగితేనే బావుంటుంది, ఏమంటావు?"

ఆమె మాటల ధోరణినిబట్టి చూస్తే షష్టిపూర్తి మహో త్సవం చేయించ మంటుందా అనిపిస్తోంది. కాని తనకి సంబంధిం చిన విషయమట పైగా.

'ఏమిటో తేల్చి చెప్పండి' అన్నాడు.

'సరోజిని విషయమే రాజూ - యీడొచ్చిన పిల్ల. అచ్చటా ముచ్చటా అన్నారు. అదే నే ననేదిన్నూ! ఏమంటావు?'

రాజు నోట్లో పచ్చి వెలక్కాయ పడ్డది పాపం. తల్లో చేయిదూర్చి ఆలోచించుతూ కూచున్నాడు.

రాజమ్మకు తెలుసు రాజు యిప్పుడు పెళ్లిప్రస్తావన రానీయడని. పైగా ఈమధ్య వచ్చిన రెండు మూడు సంబం ధాల్ని తిరగగొట్టాడు. 'నా కవసరంలేదు, నేను వెతకవలసిన పనిలేదు, అయినవాళ్ళున్నా' రని. రాజుకి అయిన సంబం ధాలు లేవని ఆ వచ్చినవాళ్లకు తెలుసు. అయితే రాజమ్మతో చెప్పిపోయినారు వచ్చినవారు. అసలు రాజుకు చదువు పూ ర్తయిందాకా పెండ్లిచేసుకోటం యిష్టంలేదు. ఆ సంగతి అంద రెరిగిందే.

రాజు ఎటూ చెప్పలేకపోతున్నాడు. రాజమ్మగారు ఎవరో తనకి తెలుసు. కాని తనెవరో వారికి తెలియదు.

తెలియనిస్తేగా! పాపం రాజమ్మగారు భ్రమిస్తున్నారుగావును. ఎంతమోసం, ఎంతమోసం! తను ఆ విషయం యింతకాలం దాచబట్టేగదా రాజమ్మగారు మోసపోవటం. తనకు తనే వూహించుకోలేకపోతున్నాడు.

'క్షమించండి...నాతో సంబంధం...' అని నసిగాడు.

రాజమ్మ గ్రహించింది. అతని వుద్దేశం. అతను అను కునేలాంటి సందేహాలు ఆమెకు లేవు. అసలా పట్టింపులే లేవు.

'మరేం ఫరవాలేదు నాయనా, అలాంటి పట్టింపులు పోయి ఎంతకాలమో అయింది' అని నవ్వింది.

రాజుకు యిక రెండో దిగులు పట్టుకుంది. వాళ్లకు గల తాహతుకు, తన తాహతుకు ఏమిటో సాపత్యం. సరోజ గొప్ప సంస్కారహృదయం గలది, చదువుకున్నది. తనకంటే గొప్పవాణ్ణి చేసుకోవడానికి అర్హురాలు మరి...

రాజమ్మవైపు తిరిగాడు. ఆమె తనవంకే చూస్తోంది ఆ క్షణం.

"మీరు పొరపాటు పడటంలేదుగదా!" అన్నాడు.

"అదేమిటి రాజూ?"

"నన్నూ, నా తాహతూ, శక్తీ తెలుసుకునే అడుగుతున్నారా?"

"అవసరంలేదు, తెలియనవసరంలేదు రాజూ!"

"మరి?"

"ఏం! నీవు మావాడివి. నీ కేమున్నా, లేకపోయినా మాకు నిమిత్తంలేదు. ఈ వున్నది చాలకనా చెప్పు! మనలాంటివాళ్ళు మరో పదిమంది బ్రతకొచ్చు. ఏంతక్కువ?"

"మరి తక్కువనిగాదు—నా స్థిమితం ఆలోచిస్తున్నా."

'నీ స్థిమితం ఏమిటె? స్థితి ఏమిటి—చెప్పు- యిదంతా ఉంది కదూ!'

ఆమెలో సనాతన సిద్ధాంతాలకు తావు లేకపోయినా, యింత సంస్కృతి వున్నదని అనుకోరు ఎవరున్నూ. ఆ వున్న ఆస్థికి, డబ్బుకూ ఎంతగర్వం, హోదా, ఠీవి వుండాల్సింది! కాని రాజమ్మలో అవేవీ మచ్చుకి కూడా కనపడవ్.

రాజు ఆమెగారిని బాగా అర్థం చేసుకున్నా. తరువాత ఏమీ మాట్లాడలేకపోయినాడు. ఆమెకు ఎదురుచెప్పటం అతని వల్లగాలేదు.

రాజమ్మ కళ్లు చెమర్చినయ్. ఇంతవరకూ రాజు ఆ మాట అంటాడా, అనడా అని పరిపరివిధాల తలపోస్తున్న రాజమ్మ ఊహలు సౌధాలయినయ్. రాజమ్మ సంతోషం పట్టలేక మేడపైకి వెళ్ళింది కూతురుతో చెప్పటానికి.

సరోజిని నిద్రపోతూంది. రాజమ్మ 'సరూ' అంటూ లేపింది. సరోజిని నిద్రకళ్ళతో లేచి 'ఏమిటే' అన్నది.

'నీకో మంచి మాట చెబుతా లేమ్మా లే'

సరోజ నిద్రకళ్లతో లేచింది.

రాజు మేడపైకి వస్తున్నాడు అప్పుడే. రాజమ్మ సరోజిని చెవిలో ఏదో చెప్తోంది. సరోజిని కళ్లల్లో నిద్రమత్తు పోయి ఆకాంక్ష, ప్రేమ నిండుకుంది. మత్తుగా రాజువైపు తిరిగింది.

రాజు కొత్త పెండ్లికొడుకులాగా చూశాడు సరోజిని కళ్ళల్లోకి.

28.8.54



# రావలసిన భావ విప్లవం

కథ రాయబోతున్న వాడినల్లా ఆగి తలెత్తి చూశాను. అర్ధరాత్రి. పక్కనే మంచంమీద రాధ పడుకొనివుంది. జుట్టంతా రేగి నాచులాగా పరుచుకొనివుంది. మధ్యలో తెల్లగా కలువ పువ్వుమల్లే రాధ ముఖం వెలుగుతోంది. గాఢనిద్రలో పైట తొలిగిందనే విషయం రాధకి తెలీదు పాపం! దీపం వెలుగుతూనేవుంది డ్రాయరుమీద. అట్లాంటి యౌవనాంగి ఆహ్వానిస్తూండగా ఈ తెల్లకాగితాలను నలుపుచేసే దౌర్భాగ్యమేమిటి? ఇప్పటిదాకా రాధ అల్లరితో సరిపోయింది. కథరాయబోయేసరికి ఈ తద్దినం వొచ్చింది. ఎవరితడు? అర్థరాత్రి. తలుపులన్నీ బిగించాను నేను. ఎట్లా వొచ్చాడు, భార్యాభర్తల గదిలోకి – ఏకాంతంగా వున్నప్పుడు?

'ఎవరు నువ్వు?'

'నన్నే మర్చిపోయావుట్రా! అవును. మర్చిపోక ఏం చేస్తావులే! ఇప్పుడు నాతో అవసరం తీరిందిగా! నన్ను జ్ఞాపకముంచుకోవలసిన బరువుగూడా లేదు మరి' అన్నాడు.

తలా తోకా లేని ఈ సంభాషణ నాకు తలనొప్పి ఎత్తించింది. అతను నా అనుమతిలేకుండానే పక్కనవున్న కుర్చీలో కూచొని రాధకేసి చూస్తున్నాడు. నాకు మండిపోయింది.

ఎవడీ గాడిద? నా రాధవైపు...అవేంచూపులు, వెధవచూపులు. నేను లేచి రాధనిసరిగ్గా పడుకోబెట్టి దుప్పటి నిండా కప్పి కొంత వరకు తృప్తిపడ్డాను.

'ఇదేనా! ఇదేనట్రా నీ సంస్కరణ? మళ్ళీ పెద్ద పెద్ద వ్యాసాలు రాస్తావే పత్రికల్లో. స్వేచ్ఛానురాగ సిద్ధాంతాన్ని కథల్లో పొగుడుతావుగా! నీ పెళ్ళాన్ని ... అదిమరింత చక్కని దయితే గోషాలో వుంచేవాడి వనుకొంటాను. చూస్తున్నానని దుప్పటి కప్పేశావా?... ఛీఛీ...రాతల్లోవున్న గొప్పతనం జీవితంలో మీ రెందుకు అందుకోలేరు? ఈ రచయితలున్నారే వీళ్లు రాసేంత గొప్పగా జీవితాన్ని అనుభవించలేరు. అంతా దొంగతనం, అబద్ధాలు!'

అందరి రచయితల తరఫునా తలొంచు కొన్నాను. మనిషి డొక్కశుద్ధి ఉన్నవాడికిమల్లే కనిపించాడు. ఫ్లాస్కులోని 'టీ' రెండు కప్పుల్లోపోసి ఒకటి నేను తీసుకొన్నాను. టీ తాగుతూ అన్నాడు—

'నాలుగేళ్ళకిందట నేనూ యిల్లాగే ఫ్లాస్కుల్లోపోసుగుని టీ తాగేవాణ్ణి. నీ చలవవల్ల ఇట్లా అయ్యాను.'

అతన్ని నే నెక్కడో చూసినట్లు గుర్తు. రెండుమూడు గంటలు మాట్లాడినట్లుగూడా కొంచెం జ్ఞాపకం. అయితే పేరు తెలీదు. ఒకనాడు గొప్పగా జీవితాన్ని అనుభవించినవాడే ననే విషయం అతని శరీరంలోని ఏ భాగం చూసినా తెలుస్తోంది. అతను నాకు పరిచితుడనే విషయం కాదనలేను. అయితే 'ఫలానా' అని స్పష్టంగా చెప్పలేను. అతని పతనానికి నేనే ఎట్లా కారణమోకూడా నాకు తెలీదు.

'ఎవరు నువ్వు?' మళ్ళీ తొలిప్రశ్న.

'అవును, జ్ఞాపకం వుండదు. ఆ స్టేజీ దాటిపోయ్యావు.

'క్షమించండి, గుర్తించలేదు.'

'నా పేరు రావుసాహెబ్ ధర్మారావు.'

మెదడు గాలిస్తున్నాను.

'నీ కొడుకుని' అన్నాడు కిసుక్కున నవ్వి.

నాకూ నవ్వొచ్చింది. యాభై ఏళ్ళ ముసిలిడొక్కు అతను. ఇరవైమూడులో నడక నాది. రాధ కాపరానికొచ్చి నాలుగు నెలలేనా కాలేదు. ఇతరత్రా ధర్మసంతానం విషయం అంటే పంకజానికి పుట్టింది ఆడపిల్ల అయుణ. ఇతను నా కొడుకట. మనిషిలో హ్యూమర్ చావలేదింకా.

'నవ్వుతావేం? నీవు నా తండ్రివి. నేను నీ కొడుకుని. భయపడకోకురా నాయనా! నీ ఆస్తిలో భాగం పెట్టమని అడగన్లే. అయితే ఎందుకొచ్చానంటావా? నీకు నా గతి చెప్పడానికి. నీ తప్పులు చూపెట్టటానికి.'

మొదటికీ యిప్పటికీ భేదం లేదు నాకు.

'తెలీదుకదూ? తెలీదురా తండ్రీ! తెలీదు. చెబుతా పట్టు. నేను నీ కొడుకుని; అంటే నీ కథలో పాత్రని. నాలుగు సంవత్సరాలక్రిందట నన్ను గురించి కథ రాశావు. నా పేరు రావుసాహెబ్ ధర్మారావు. నాకు నాలుగు మిల్లు లుండేవి. రెండొందలెకరాలు మాగాణి వుండేది. నాది నాలుగంతస్తుల మేడ. మేడమీదినుండి కిందికి దిగను. సిల్కుల్లో మునుగుతుండేవాణ్ణి. ఎయిర్ కండిషనర్ ఎప్పుడూ నా పక్కనే వుండేది. నాలుగు పెద్దకార్లు నావి. ప్రజల్ని దోచుకొనేవాణ్ని. కార్మికుల 'రక్త

మాంసాలు' పీల్చేవాణ్ని. సమాజాన్ని 'దోపిడి' చేసేవాణ్ని. ప్రజలనుండి 'దొంగతనం' చేసిన డబ్బుతో నేను 'రావు సాహెబ్' నయ్యాను. ముండలముఠాకోరుని. తాగుబోతుని. కూలీల కొంపలు తగలబెట్టించినవాణ్ని.'

"నువ్వా! జ్ఞప్తికొచ్చింది, నరరూపరాక్షసి! కథలో నాయకుడివి నువ్వేగదూ? అయితే యిదేమిటి? ఈ గోనె పట్టాలు, పుళ్ళు, పెరిగిన జుట్టు, జోరీగలు..."

నవ్వాడు.

"ఇదంతా నీ చలవే"

"ఏంచేశాను?"

'నామూలంగానే సమాజం యిట్లా అవకతవగ్గా వుందని రాశావు. నా ఆస్తినంతా ప్రజలపరం చేస్తే సమాజం సుఖంగా వుంటుందని రాశావు.'

'అవును రాశాను. అట్లా వుండటం మంచిదేగా?'

'మంచిదే! ఇదిగో యిదే మంచి.'

'ఏం?' అన్నాను అయోమయంగా. నా సిద్ధాంతంలో ఎక్కడ పొరపాటుబడ్డానో నాకు తెలీలేదు.

'నీమాటప్రకారం ఆస్తినంతా ప్రజల కిచ్చేశాను. పొలం కవులుదార్ల కిచ్చేశాను. డబ్బు పంచిపెట్టాను. మేడ పాతిక కార్మిక కుటుంబాల కిచ్చాను.'

'భేష్! యింకేం! యిప్పుడు వాళ్లంతా సుఖంగా జీవిస్తున్నారుగదూ?'

'అదే లేదు. అట్లా జరిగితే నేనూ సంతోషించివుందును.'

'మరి?...'

"తొందరపడబోకు. చెబుతా విను నా మిల్లులు దానం గ్రహించినవాళ్ళు సుఖంగా వ్యాపారం చేసుకొంటున్నారు. కవులుదార్లకు పొలం కొంచం ఎక్కువొచ్చింది నిజమే! అంత మాత్రాన వాళ్ల దరిద్రం పోలేదు. మరొక భూస్వామిపొలం కవులుచేస్తున్నారు. డబ్బు పంచితే తలకు నాలుగు రూపాయలు రాలేదు. పాతిక కుటుంబాల కార్మికు లా మేడ నమ్ముకొని వొచ్చిన డబ్బుతో కొందరు చెడతాగారు. కొందరు చిన్న చిన్న వ్యాపారాలు చేసుకొన్నారు. నేనుమాత్రం యిట్లా తయారయ్యాను కూటికీ గుడ్డకూ మొఖంవాస్తూ.."

"అబద్ధం. నువ్విట్లా చెయ్యలేదు. దొంగమాట చెబుతున్నావు నాతో" అరిచాను బిగ్గరగా.

"అరవబోకు. అవతల శ్రీమతి లేస్తుంది. నేను చూస్తాను. ఖర్మంజాలక నే నామెను ప్రేమించినా ప్రేమించ వొచ్చు. అదిగో! అప్పుడే మొఖం మటమటలాడిస్తున్నావు. పోన్లే, ఆ గొడవెందుగ్గాని...ఆఁ, ఏమన్నావ్? అబద్ధమనిగదూ? కాదు. నిజం! నిజం! ముమ్మాటికీ నిజం!"

"శుద్ధ అబద్ధం"

నీరసంగా నిట్టూర్చాడు.

"నేనొక్కణ్ని ఆస్తి సంఘపరం చేసినంతమాత్రాన ప్రజాస్వామికం రాదు. ఇట్లా వొచ్చింది ప్రజాస్వామికం కాదు."

"మరేమిటి?"

"పెట్టుబడిదారీవిధానంలో ఒక పరివర్తన. మార్పుచెంది నట్లే కన్పిస్తుంది. కాని మార్పుచెందదు.

"నా కంతా గొడవగా వుంది."

మరో కప్పు టీ తాగి చెప్పాడు:

వ్యక్తిగతమైన పరివర్తన పరివర్తనకిందికి రాదు. మార్పునేది సంఘపరంగా జరగాలి."

'సంఘమనేది వ్యక్తుల సమూహం అయినపుడు,వ్యక్తులు మారినప్పుడు సంఘం మాత్రం ఎందుకు మారదు?'

నేను మాట్లాడలేదు.

'నే నొక్కణ్ణి మిల్లు పెట్టనంతమాత్రాన, నేను వ్యాపారం చెయ్యనంతమాత్రాన సామాజికు లందరూ నా మోస్తరుగానే వుంటారనే నమ్మక మేముంది? దోపిడీ చేసేవాళ్ళను నిందించడం కంటే, వాళ్ళు దోపిడీ చెయ్యడానికి ఏ యే అవకాశాలు ప్రోత్సాహ మిస్తున్నాయో వాటిని నిర్మూలించడానికి ప్రయత్నం చెయ్యడం జరగాలి. అప్పుడు దోపిడిగాళ్లు తమంతట తామే దోపిడీ కార్యక్రమాన్నుండి బైటికొస్తారు.'

'తినమరిగిన కోళ్ళు యిళ్లు దిగుతయ్యా?'

'దిగవు. దిగేటట్లు చెయ్యాలి'

'అయితే వ్యక్తులు మారితే లాభం లేదంటారు. వ్యక్తుల తత్వాలు మారాలంటారు. అవునా?'

'అవును'

'మారాలనడం సులభమే. కాని, వొకంతట మారడం కష్టం...మార్పులు రావాలంటే ఏం చెయ్యాలి?'

'మీరు కావాలనుకొనేది ఏ మార్పు?'

'వీటిల్లో మళ్ళీ రకరకాలా ఏమిటి?'

'ఆర్థిక మార్పు, భావ మార్పు.'

'అన్నట్లు జ్ఞాపక మొచ్చింది. భావ విప్లవం కంటే ముందు ఆర్థిక విప్లవం రావాలని ఎక్కడో చదివినట్టు గుర్తు. ఎంచేతంటే ఈనాటి ఆర్థిక విధానమే యిట్లాంటి భావా లుండ డానికి కారణం. అయినప్పుడు వొక్క ఆర్థిక విప్లవాన్ని విజ యం చేసుకుంటే దానివల్ల భావవిప్లవ విజయంకూడా లభిం చినట్లేగా?'

'దేనికైనా విలువలు తెలియాలి. తాగుబోతుకి వంద రూపాయలిచ్చి దాచుకోమంటే సారాతో స్నానం చేస్తాడు. వాడికి వందరూపాయల విలువ తెలియదు. కార్మికులకు నేను మేడ యిచ్చాను. అమ్ముకొని చెడ తాగారు. ఆర్థికంగా అక్కడ మార్పు జరిగింది. కాని దాని ఫలిత మేమయింది? ఒట్టి ఆర్థిక విజయం నిండైన వ్యక్తిత్వాన్ని యివ్వలేదు.'

'కడుపులో పేగులు చుట్టలు చుట్టుకెళ్లే వాడికి కావల సింది తిండి. అది లేకుండా నువ్వెన్ని శుష్కప్రియాలు చెప్పినా వాడు వినడు. అవతల ఆకలితో మాడుతున్న వాడికి నీ 'ధర్మ బోధ'లు చెవికెక్కుతాయంటే నమ్మలేకపోతున్నాను. ముందు కావలసింది తిండి.'

ఫక్కున నవ్వాడు.

'తిండి కావాలి. నిజమే! తిండి కావాలంటే ఈ పద్ధతుల్లో దొరకదు. సామాజిక విధానం మారాలి. విప్లవానికి ఈ నాడు సంఘంలోవున్న భావాలు' పచ్చి వ్యతిరేకం. మానవుని జీవితం మానవుని చేతిలోనే వున్నదనే విషయం ప్రతిమానవుడికీ తెలి యాలి. అప్పుడు ఏ అవసరం లేకుండానే వాళ్ళు తమ 'గతి'కి కారణాలు కనుక్కోగలుగుతారు. ఆ ఫలితాలే వాళ్ల చేత విప్ల

వాన్ని జరిపించి విజయాన్ని సాధించి పెడతాయి. తన జీవితాన్ని దేవుడు,కర్మల అధీనం చేసినంతకాలం మానవుడు దేన్నీ సాధించలేడు. ఆ పారతంత్ర్యాన్నుండి అతను ముందు బైటపడాలి. వడేటట్టు చూడాలి.'

అతని మాటలు వింటే నిజమే ననిపించింది నాకు. హఠాత్తుగా జ్ఞాపకమొచ్చింది.మధ్యలో అతను ఏ 'యిస్టో?'అడిగాను:

'నువ్వు కమ్యూనిస్టువా?'

'కాదు'

'రాయిస్టువా?'

'కాదు'

'పోనీ సోషలిస్టువనుకోంటాను?'

'ఇదొక రోగం. నేను చెప్పేది నిజమైనప్పుడు నే నే 'యిస్టు'నైతే నీకెందుకు? నాకు ఏదో వొక యిస్టును అంటగట్టి వొక 'యిజం' అద్దంలోనించి నన్నెందుకు చూడగోరుతున్నావో అర్థంకావడంలేదు. నా భావా లేమిటో చెప్పాను. వీటిని యిట్లాగే ఎందుకు స్వీకరించలేవు?' నా భావాలకు వొక 'యిస్టు, మేకప్' యిస్తేనేగాని నీకు బాగుండదుకదూ? యదార్థాన్ని యదార్థంగా చూసే తత్వం నీ కింకా రాలేదు.

చప్పున కుర్చీమీంచి లేచి నాతో చెప్పకుండానే వెళ్ళిపోయాడు. ఏదో అడుగుదామని పిలిచాను. నా పిలుపు తిరిగి నా దగ్గరికే వొచ్చింది.



# ఆమె!

"జయా! ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?" అంటుంటే మాధవయ్యగారి కళ్ళు ఎర్రబడ్డయ్.

''అవును, మీతోనే!''

''అయితే నా మాట లక్ష్యపెట్టవన్న మాట?''

"ఇంతకాలంనుండి లక్ష్యపెట్టుతుండబట్టే......"

"జయా!"

"అవు న్నాన్నా!"

"ఏమిటి అవును. కూటికి, గుడ్డకు లేని బుక్కా–ఫకీరు సీతాపతి– వాడితోనా......"

"అలాగే కనిపిస్తారు మీ కళ్ళకు. ఇనపపెట్టెలనిండా లక్షలు మూలుగుతుంటే వాడెలాంటి నాపవెధవయినా గొప్ప వాడు మీ దృష్టికి. కాని అసమాన ప్రజ్ఞావంతుడు, వక్త అయిన సీతాపతి నీచుడు. మీ విజ్ఞానం అంతలో వుంది."

"నా కడుపున తప్పబుట్టావే నువ్వు! ఏ అడుక్కుతినే వాళ్ళలో పుట్టినట్లయితే నీ తిక్క కుదిరేది. తింటానికి, వుంటానికి మహారాజులాగా జరుగుతుంటే కళ్ళు అలాగే నెత్తికొస్తయ్. ఎవరిని ఎక్కడుంచాలో అక్కడే వుంచాలి. కోతిని తీసుకెళ్లి సింహాసనం ఎక్కిస్తే ఏమౌతుంది? అప్పుడే ఎవడికో యిచ్చి ముడిపెట్టినట్టయితే కుదిరేది తిక్క. కాలేజీ చదువులకని వంకబెట్టి నాపవెధవని 'లా' చేస్తానంటావా? ఛీ!"

"నాన్నా! పొరపాటు."

"మొయ్ నోరు. నా ముందు అధికంగా వాగబోకు!"

"అయితే!"

"ఏమిటి అయితే?"

"సీతాపతిని వీల్లేదంటారా!"

"అంటారా! అంటారా యేమిటి యింకా? ఈ సారి నా కంటికగ్గనిపించనీ, ముక్కలు విరగదంతాను, వాణ్ని. దొంగ వెధవ. నీ అమాయకత్వాన్ని కనిపెట్టి వలలో వేసుకున్న నీచుడు. చాల్లే యిక నీ చదువులు. కాలేజీ వొద్దు, యేంవొద్దు. కొంపలో పడివుండు."

"జయ మీ కూతురు కాదనుకోండి.అసలు జయ పుట్టనే లేదనుకోండి."

"ఏమిటీ?"

"అదే చివరివాక్యం నే చెప్పదలచుకుంది. జయ ఈ నాటితో చచ్చిపోయిందని చాటండి!"

"ఏం? ఏం అఘాయిత్యం చెయ్యబోతున్నావ్?"

"అదంతా మీ కనవసరం యిక. నా దోవ నే చూచుకుంటున్నాను."

"ఆ సీతాపతితో నేనా?"

"అవును!"

"పో!త్వరగా పోవేం? నా కంటికగ్గనిపించకుండా పో... ఊం!"

♦ ♦ ♦

చాలా పొరపాటు జరిగింది జయా!"

"ఏమిటి పొరపాటు."

"నీవు అసలు యింట్లోంచి వొచ్చెయ్యటం"

"ఓ, అదా! మరేం ఫరవాలేదు."

"ఫరవాకాదు. ఎంతయినా కన్నతండ్రి. బోలెడంత ఆస్తి. అదంతా వొదిలిపెట్టుకొని"

"ఆస్తి! వెధవాస్తి, డబ్బు మానవునికి సంతోషాన్నిస్తుందనా మీ వుద్దేశ్యం?"

"కాకపోయినా కష్టించకుండా"

"ఆ నీచమైన, కూడబెట్టిన డబ్బు తగలేసేకంటె అడుక్కు-తింటో సుఖంగా బ్రతకటం చాలా మంచిది నా వుద్దేశంలో. ఏమంటారు?"

"అనేందుకేముంది? అంతా ఏమంటారు? ఫలాని జయకి సీతాపతి మందుపెట్టి లేపుకెళ్ళాడంటారు అవునా?"

"కాదు, ఫలాని జయ సీతాపతిని ప్రేమించి..."

'చూడు! నాతో జీవితం గడపడం అంత తేలికైన పని కాదు. తల్లి, తండ్రి, ఏ యితర బంధువులు లేనివాడిని. అంతా నన్ను బయటకు నెడ్తారు. యింతకాలం నే నెలా బ్రతుకుతున్నానో నీకు తెలుసుగా. డబ్బుకు అవసరమై నీ దగ్గ రెంత పుచ్చుకున్నానో నీకు జ్ఞాపకంలేదూ? యింతవరకు తిరిగియిచ్చే ప్రయత్నంలోకూడ లేను.'

"పోనీ, యీవిధంగా యిస్తున్నారుగా!"

"నాతో పడవలసిన కష్టాలకు నీ సుకుమార ప్రాణం ఓర్చుకోలేదు పాపం!"

"అన్నిటికీ వొప్పుకున్నానండీ!"

"మాటల్లోనే కాని, ఒక్కపూట తిండిలేక, చేతిలో కానీ లేక నకనకలాడుతూ గడిపిన దినా లున్నయ్. అవన్నీ తలుచుకొని, నిన్ను తలుచుకుంటె ఒక్క ఏడుపు, విచారం మినహా నా కేం మిగిలేట్టు కనిపించటంలేదు."

"మీరు నాకు తేడా చేస్తున్నారు!"

"క్షమించు!"

♦ ♦ ♦

"అదే రేపు మీటింగులో చెప్పబోతున్న విషయం' అన్నది జయ.

'ఏమి టది?'

'లిబర్టీ, ఈక్వాలిటీ కావాలి. చాలా అవుసరం మానవుడికి.'

'కాదని ఎవరన్నారు?'

'అదికాదు. ఈ కోటీశ్వరులు, లక్షాధికారులు, షావుకా ర్లున్నారే! బొర్రలు పెంచుకున్న కుబేరులు– వీ ళ్ళందర్నీ లైటుస్థంభాలకి వ్రేలాడదీయా లసలు. అప్పటిగ్గానీ ఆర్థికస్వాతంత్ర్యం రాదు.'

నిజమే, రష్యన్‌విప్లవం అలాంటిదనే విన్నాను.'

'అనేకాదు సీతాపతీ! లేకుంటే మరోమార్గం లేదు. లేకపోతే తిండికీ, గుడ్డకు లేక వేలకు వేలు, లక్షలకు లక్షల జనం ఆబాలగోపాలం చస్తుంటే యినప్పెట్టెల్లో చదలుపట్టే కరెన్సీని ఎందుకు ఖర్చుచెయ్యరాదో దుర్మార్గులు!'

అనుకున్నంత తేలిగ్గాదు జయా! నీవు చెప్పే విషయం నిజమే; వొప్పుకుంటా. కానీ, ఫలితం...'

'అంతా అలాగే ననుకుంటూ చేతులు ముడుచుకుని కూర్చుంటే సరి, బాగుపడుతుంది పరిస్థితి. అన్నిటికీ వెధవ అనుమానాలు. ఏ పనీ ధైర్యంతో చెయ్యడం లేదు. అందుకనే మన యిండియనుస్ను.....'

'నువ్వో పెద్ద రష్యన్‌లా మాట్లాడతావేం?

'కాదనుకో. కాని భావాలు ఎవరిలో లేకుండా వుంటయ్?'

'అవుననుకో... ఎవరికో వస్తోంది... టెలిగ్రాం... అవునా'?

'అవును... ఎక్కడ్నుండో... మద్రాసునుంచి కమల యిస్తుందనుకుంటూనే వున్నాను...'

'కమల కాదులే. మా ఫ్రండ్ టెలిగ్రాం యిస్తాను, వెంటనే రమ్మన్నాడు.'

'బాగుంది'

సీతాపతి టెలిగ్రాం చదివి 'యిదిగో యింద ... మీ నాన్న'

"మా నాన్న !!"

'ఏం, అంత ఆశ్చర్యం!'

"ఎలా వ్రాశాడబ్బా!'

"డబ్బా!?"

'డబ్బు కాదండీ'. (చదివి) అయ్యో! జబ్బుగా వుందటండీ. సీరియస్..."

"పోనిత్తూ!"

'మిమ్మల్ని గూడా రమ్మని వ్రాశారు'

'పోనీ, నీవు పోయి రా, రేపు మీటింగు నే చూస్తాను'

'పోనీండీ వెధవ మీటింగులు, పోస్టుపోన్ చేసుకుంటారు. మన ముంటేనే మీటింగు, లేకుంటే పికిటింగేగా'

'తప్పదంటావ్ !'

'నే ననాలా యేం'

♦ ♦ ♦

'నాన్నా!' ఏడుస్తూ జయా, సీతాపతి వచ్చారు.

'ఇంకా యేంనాన్న తల్లీ. బ్రతికినంతకాలం ఆయన కడుపులో చిచ్చుపెట్టావు. ప్రాణం పోయేప్పుడుకూడా నీ కలవరింపే. పాపం! ఆ అబ్బాయి- సీతాపతికి ఏదో ద్రోహం చేశానని తెగ కలవరించాడు.'

'జయా! వూరుకో, అంతా అయింతర్వాత ఏడ్చి ఏం లాభం?'

'కాదు బాబాయ్...చివరిసారి చూడకుండానే...'

'మన ఖర్మ తల్లీ ఏంచేస్తాం చెప్పు. నీ కా ప్రాప్తం లేదు...... అన్నట్లు బ్యాంకులో కాష్ మొత్తం రెండులక్షల పదకొండువేలు నీ పేర ట్రాన్స్ఫర్ చేశారు మీ నాన్న. ఈ యిల్లు అదీ యిక నీది. పాపం! చచ్చి ఏలోకాన వున్నాడో గానీ. ఎప్పుడూ నీ కలవరింపే. మహానుభావుడు. ఏం నాయనా సీతాపతి! యిక నీవు, అమ్మాయి జయా... వస్తా... పొద్దు పోయింది'

♦ ♦ ♦

సీతాపతి ఈజీచైర్‌లో కూర్చొని సిగరెట్ కాల్చుకుంటున్నాడు. జయ మాగజైన్ చదువుతూ ప్రక్కనే పచారు చేస్తోంది.

'ఉత్తరం సార్!' పోస్టుమేన్ కేక.

'అందుకో జయా!'

'ఊ, తీసుకోండి'

'చదువు!'

చదివింది...

'మీటింగులట, మీటింగులు! ఎప్పుడూ వెధవలకు పని లేదు. మీటింగులు, తీర్మానాలు. ఫలించేవా! చచ్చేవా! వీళ్ళ రిజల్యూషన్లు. ఏదో తిన్న దరక్క...'

'మన కట్లాగే అనుపిస్తుంది.'

'ఎవరికైతేమాత్రం?' జయకళ్ళల్లోకి కోపంవచ్చింది.

'ఎప్పుడూ దరిద్రమే. వెధవ దరిద్రం! అయినా ఒకరు చేతుల్తో తీసేసేదా చెప్పండి. ప్రభుత్వమే గుడ్డిగా వున్నప్పుడు ఎవరుమాత్రం ఏంచేస్తారు?'

'కానీ, మానవుడు ప్రయత్నించాలి. విప్లవాలు ఎందు కనుకున్నావ్?'

'విప్లవాలు! వీళ్ళంతా బాగుపడతారనా?'

'మరి!'

'ఎవరి సొమ్మో తేరగా దొరుకుతుంది, కాజేద్దామని ఆశ. కూలిముండాకొడుకులు కూలి ముండాకొడుకుల్లా వుండ కూడదూ? వీళ్లకి మిల్లుల్లో, ఫ్యాక్టరీల్లో భాగాలు దేనికి?'

'అదేంటి జయా! నిన్న మొన్నటివరకూ విప్లవాలు కావాలని, సమ్మెలు కావాలని మీటింగులు చెప్పావుగా?'

'అవును. అప్పుడు అదే మంచిదనిపించింది.'

'ఇప్పుడు లక్షాధికారి వయ్యేసరికి ఇది మంచిదయింది. అంతేనా?'

'పోనీ, అంత సరదావుంటే మీారు పొండి.'

'పిలిచింది నిన్ను, పోవలసింది నువ్వు. మధ్య నేనా పోవటం? ఏదో అంటారే, కందకులేని దురద చేమకెందుకు చెప్పు!'

---

# మా నిషాద

ఇంటర్ చదువుతూండగా పెళ్ళయింది పార్వతికి. అయినా ఆమె చెప్పుకోదగ్గ ఉత్సాహాన్ని ప్రదర్శించ లేకపోయింది. పెండ్లికూతురుమాట ఎట్లాగయినా వుండనీండి. యింట్లోవారి సంబరానికి పట్టపగ్గం లేకుండాపోయింది. కారణం అందరూ అనుకున్న సంబంధం కలిసిరావటమే. మేనమామకే పార్వతి నిచ్చి పెండ్లిచేశారు.

కిష్టారావు పార్వతిని ప్రేమించికాదు పెళ్ళాడింది. ఎక్కడా దొరకక్క చేసుకొన్నాడు. కిష్టారావు మొదటి భార్య చచ్చిపోయి పది సంవత్సరాలయింది. అప్పటినుండి పార్వతి మీద కళ్లుపెట్టుకున్నారు యింట్లో వారందరూ. కాని ఆమెకు మాత్రం అతనిమీద మనసులేదు. బొద్దుగా, అసహ్యంగా వుంటాడు. కావటానికి ప్లీడరే అయినా అతని తత్వం మానవ మాత్రులు సహించరానిదిగా వుంటుంది. అందులో కాస్తో కూస్తో కాలేజీ జీవితాన్ని రుచిచూచిన పార్వతి సహిస్తుందన టానికి వీల్లేదు.

అక్కర మొదటిరాత్రే లేడిపిల్లలాగా భయపడింది. పార్వతి— సన్నగా, పచ్చగా, నాజూగ్గా దేవతామూర్తిలా వుండేపార్వతి యముడులాంటి కిష్టారావునుచూచి నిజంగా భయ పడింది. ఏడ్చింది. ఎంతఏడ్చినా అతను దయతలిచాడా? పాపం!

పది సంవత్సరాల ఆశలు, కోరికలు ఒక్కసారిగా అతని కళ్లల్లో ప్రతిఫలించినయ్.

పార్వతిపైన కిష్టారావుకు అమితమైన కోపం వచ్చింది. కానీ, ఆ సమయంలో ఏమనటానికీ వీల్లేక వూరుకున్నాడు. ఆడవాళ్ళ గుణమే అంత. మగవాడి యిష్టప్రకారం ప్రవర్తించుకోటం చేతగాదు వీళ్ళకు! తను అంత ప్రేమగా, ఆశగావుంటే పరాయివాణ్ని ఎవణ్నో చూసినట్లుగా చూస్తుందా తనను అనుకున్నాడు. మరునాడు పార్వతి పగలు పన్నెండయినా నిద్ర లేవలేదు. కాఫీ తాగలేదు. వొళ్ళంతా నొప్పులు. తలనొప్పి, జ్వరం వొచ్చినయ్.

రాత్రి కిష్టారావు అన్న మాటలకు ఆమెకు విరక్తి కలిగింది. యింత అనాగరికుడేం అనుకుంది. ఈ దున్నపోతుకు తననెందు కిచ్చి చేశారా అని మధనపడింది. "నీ రంకువేషాలు నా దగ్గర వెయ్యకు" అన్నాడు అసహ్యంగా అభము శుభమూ తెలియని తనను పట్టుకొని. "ఇవ్వాళ మొండికేస్తే ముందుగతి ఏమిటో ఆలోచించుకో" అన్నాడు నీచుడు, తుచ్ఛుడు, లుచ్ఛా అయిన కిష్టారావు. ఇన్ని సంవత్సరాల అనుభవమున్న లాయరు- కిష్టారావు అలా అంటాడా అనుకుంటారు. అంటాడు. అతని అనుభవం, మంచితనం యితర విషయాల్లో. ఈ విషయంలో కుక్కకన్న హీనం.

ఏకంగా పార్వతిని కాపురానికే పంపారు కిష్టారావు కోరికమీద. "మీ అమ్మాయికేం, మహారాణిలా వుంటుం" దన్నాడు. అతనితరఫు ముసలమ్మ అంది "చిన్నతనం. అయినా మేన పార్వతి చాలా మంచిది. మేమంతా లేమూ" అన్నది

హోమగుండంలో సమిధ్ధలా చేయటానికి, అతని కోరికలకు బలి చేయటానికి. ఇంతకీ పార్వతితరఫున మాట్లాడింది, అనుకున్నది ఎవరూ లేరు. తల్లిమాత్రం అంపకాలప్పుడు కన్నీరుపెట్టుకుంది సాధారణంగా, లాంఛనంగా.

పార్వతి వెళ్ళిన పదిరోజులకల్లా యింటిపనులన్నీ సొంతంగా నిర్వహించుకోవలసి వచ్చింది. యింట్లో పనిమనుషులు కాదుగదా, మంచిగా మాట్లాడేవారుకూడా లేకపోయారు. అంట్లు తోముకోవటందగ్గరనుండి రాత్రికి పక్కలు పరచేవరకూ క్షణం తీరిక వుండేదిగాదు పార్వతికి. కిష్టారావును ఒకసారి లాలనగా అడిగింది "ఎవరైనా పనిమనిషిని కుదుర్చుకుంటాను. అన్ని పనులు ఒక్కదాన్నే చేసుకోలేకపోతున్నా" నని. "మనమేం లక్షాధికారులం, రాజాధిరాజులం కాదు పనిమనుషులకు, పరివారాలకు డబ్బు తగలేసుకోటానికి" అన్నాడు.

"అయితే, రాజాధిరాజులేనా పనివాళ్లను పెట్టుకునేది" అంది. ఆ మాటకు కిష్టారావుకు అమితమైన కోపం వచ్చింది. "నాకే ఎదురుచెపుతావా నువ్వు? అయినా యిద్దరు మనుషులున్న యింట్లోనే పనిచేయలేని ఆడదానివి నువ్వేం ఆడదానివే" అని చీవాట్లుపెట్టాడు.

ఆమెకు ఆ యింట్లో స్వాతంత్ర్యం లేదు. కేవలము దాసిగా జీవిస్తోంది. అతని అవసరాలకు తన ఆశయాలను కుదించుకోవలసివస్తోంది. సినిమాలు, క్లబ్బులు, పత్రికలు- వేటికీ నోచుకోలేదు ఆమె. ఆమెకు జీవితం అగ్నిగుండంలాగైంది. అందులో సమిధలా కాలిపోతోంది. తన మొరాలకించేవారు ఎవరూ లేరు పాపం!

అసలే సన్నగా వుండే పార్వతి యింటిపనుల్తో ఎముకల ప్రోవుగా మారిపోయింది. పచ్చగావుండే శరీరం పొయ్యి శగకి నల్లకప్పేసింది. పుట్టింటివారు పెట్టిన నగలు పెట్టుకున్నా వూరు కోడు కిష్టారావు. సంవత్సరానికి నాలుగు చీరలకన్నా ఎక్కువ కొనడు. అంతకన్నా ఎక్కువ వాడుకోవటం అనవసరం. 'నేను చూడు! రెండుసూట్లు కొంటే ఆరు సంవత్సరాలు వాడుతాను' అంటాడు. అంతా తనలాగానే బ్రతకాలంటాడు. తనదే ఆదర్శ జీవితం అనుకుంటాడు. కాలేజీలో సీతాకోకచిలుకలా తిరిగిన పార్వతికి కిష్టారావుకోడి దాంపత్యం యమలోకంగా, బంది ఖానాగా వుంది.

పార్వతి ఒకసారి తండ్రికి ఉత్తరం వ్రాసింది రమ్మని. తండ్రికి కూతుర్ని చూసి గుండె నీరైపోయింది. ఎలాంటి పిల్ల ఎలా అయిపోయిందా అనుకున్నాడు. కన్నీరు పెట్టుకున్నాడు. అయినసంబంధంగదా, కూతురు సుఖపడుతుంది అనుకున్నాడు గానీ, యింతగా నాశనమైపోతుం దనుకోలేదు. కిష్టారావుని అడిగాడు అమ్మాయిని తీసుకెళ్ళి పదిరోజులుంచుకొని పంపుతా నని. సుతలాం వొప్పుకోలే దతను. పార్వతి ఆశలు ఆడియాశ లయినాయి. చేసేదిలేక వెళ్లిపోయాడు రెండు చీరలు కొనిపెట్టి, ఒక పాతికరూపాయలు చేతిలోపెట్టి.

కిష్టారావుదృష్టిలో పార్వతి ఆదర్శగృహిణి. ఆమెను గురించి అతను చాలా గర్వపడుతూంటాడు లోలోపల, పైకి మాత్రం ఆమె మంచితనాన్ని మాటల్లోకి రానీడు. యితరుల దగ్గర మాత్రం పొగడుతుంటాడు పార్వతి గుణగుణాల్ని గురించి, మంచితనాన్ని గురించీ.

అయిదు సంవత్సరాల అనుభవంతో పార్వతి అతనిపర మైంది. అతని ఆదర్శాలకు అనుగుణంగా ప్రవర్తించగలుగు తోంది. ఆమెకు ఎవరిని గురించిన విచారమూలేదు ప్రస్తుతం. కాలేజీజీవితాన్ని పూర్తిగా మరచిపోయింది. పుట్టింటివారిమీద ఆశలు కోల్పోయింది.

పార్వతివల్ల తనకు పుత్రసంతానం వాంఛించాడు కిష్టా రావు. కానీ, తన కా అదృష్టం కలగలేదింకా. అసలు కలుగు తుందో లేదో అనుమానంకూడా. పార్వతి అంత బలహీనంగా అర్భకురాలుగా వుంది. కిష్టారావు ఆస్తికి యింకా వారసులంటూ లేరు.

కిష్టారావు కోర్టుకెళ్ళిన సమయంలో పార్వతికి ఉత్తరం వచ్చింది కలకత్తానుండి. ఎవరో దాసు, తను వస్తున్నానని వ్రాశాడు. ఆమె హృదయంలో కలకలం బయల్దేరింది. మరచి పోయిన దాసురూపం మళ్ళా ఆమె మనోఫలకంమీద ప్రతి ఫలించింది. గతించిన విషయాలు తిరిగి జ్ఞప్తికొచ్చినయ్. అతను రావటం ఆమెకు సంతోషం, విచారంగూడా. తనకాలేజీ రోజుల్లో తనలో ఆశలు లేపిందా దాసే. అప్పట్లో అతణ్ని పెళ్ళి చేసుకుందామనుకుంది. కానీ సిగ్గుచే ఎప్పుడూ తన మనసులోని విషయాన్ని పైకి చెప్పలేకపోయింది. గంటల తరబడి అతనితో మాట్లాడేది. కానీ, అంతకన్నా జరిగిందిలేదు. దాసు తనను ప్రేమించాడు. అయినా అతను బీదవాడు. తన జీవితానికే అస్తుబిస్తుగా గడుస్తున్న దాసు తనను ప్రేమిస్తున్నాను అని చెప్పలేకపోయాడు. నోరు తెరచి అడిగినా అప్పట్లో తను వొప్పుకునేదీ గాదు.

అప్పటినుండి దాసు ఒంటరిగానే జీవిస్తున్నాడు. ప్రపంచానికి విరుద్ధంగా బ్రతుకుతున్న దాసు అప్పటికీ యిప్పటికీ అంతే. దాసు తలిదండ్రులతో పోట్లాడి వెళ్ళిపోయాడు. బియ్యే చదివిన దాసు గవర్నమెంటు నౌకరీ చేస్తాడని, తమ కుటుంబాన్ని ఉద్ధరిస్తాడని నమ్ముకున్న తలిదండ్రులకు అన్యాయంచేసి వెళ్ళిపోయాడు. అప్పటి నుండి యిప్పటి వరకూ ఎలాబ్రతికాడో తెలీదు ఎవరికీ. కానీ, యిప్పుడు తనకు ఉత్తరం వ్రాసి వొస్తున్నాడంటే వెలుగు చీకట్ల మేళవింపు ఆమెకళ్లల్లో తొణికిసలాడింది.

దాసును చూడగానే పార్వతి సంతోషం పట్టపగ్గాలు లేకుండా పోయింది. 'ఇతనేనా దాసు. అబ్బ ఎంత మారిపోయాడు!' అనుకుంది.

'ఏం పార్వతీ! జ్ఞాపకం వున్నానా?' అన్నాడు దాసు.

ఆమె కళ్ళు ఆనందభాష్పసంకలితమైనయ్.

'దాసూ! వొచ్చావా నిజంగా— మళ్ళీ నిన్ను చూస్తాననుకోలేదు! —! అంది పార్వతి.

దాసుకు ఆమెతో ఏకాంతంగా మాట్లాడుకునే అవకాశం లభించింది—ఆ కొద్దికాలాన్నే సద్వినియోగం చేసుకుని, ఎంతో చరిత్రను వల్లించాడు. "మరీ అలా చిక్కి పోయావేం పార్వతీ? చదువుకొనే రోజుల్లో ఎంతో అందంగా, కొంటెగా వుండే దానివి. మనిషివి పూర్తిగా మారిపోయావే!" అన్నాడు.

ఆమె తల వొంచుకొని కళ్ళ నీళ్ళుపెట్టుకుంది సమాధానంగా. "నీ క్లాస్ మేట్ కమల కలకత్తాలో చాలాసార్లు కలి

సింది. ప్రస్తుతం అక్కడే వుంటోంది. నిన్ను అడిగానని చెప్ప మందికూడా?" అన్నాడు.

"ఏ కమల?"

"మరచి పోయావూ? భలే! అంతస్నేహంగా వుండేవాళ్లు మీరిద్దరూ. ఎలా మరచి పోయావు?"

లేదు దాసూ! నా కా విషయాలేవీ జ్ఞాపకంలేవు. నీవు తప్ప మిగతా కాలేజీ ప్రపంచాన్నే మరచిపోయాను. మరచి పోవలసిన పరిస్థితులు వొచ్చినయ్. ఏంచేసేది?

"ఏం, సుఖంగా వుంటంలేదూ? కిష్టారావు బాగా చూట్టంలేదా?"

"అదంతా ఎందుకు చెప్పూ. ఎలాగో బ్రతుకుతున్నాను."

అలాకాదు పార్వతీ! చెప్పూ—ఏమిటి నీకు కష్టం?"

వీపుమీద, కాళ్ళమీద వాతలు చూపించింది. "కిష్టారావు రాక్షస ప్రవర్తన యిలాంటిది. మనిషిని వూరికే అనుమానిస్తాడు. చచ్చేటట్టు కొడతాడు. యిదే లోకం నాకు' అంది.

ఆమెస్థితి దాసు హృదయాన్ని కరిగించివేసింది. కిష్టారావుమీద అంతులేని కోపంవచ్చింది. కానీ ఏంచేస్తాడు? ఏం చేసినా పార్వతి జీవితం నాశనమై పోతుంది. ఆమె మీది ప్రేమ చొప్పున అన్నీ సహించి వూరుకున్నాడు.

కిష్టారావు యింట్లో లేనిసమయంలో దాసు పార్వతి మంచి చెడ్డలు కనుక్కోటానికి వొస్తుండేవాడు. ఆమెస్థితి రోజురోజుకీ దారుణంగా మారిపోతోంది. మరీ రోగిష్టిగా మారిపోయింది. ఎక్కువ కాలం బ్రతికే ఆశలుకూడా లేవు...

అదీ డాక్టర్లు చెప్పింది. అయినా యింట్లో నానా వెట్టిచాకిరీ చెయ్యక తప్పటంలేదు ఆమెకు.

పార్వతి ఆరోగ్యాన్ని గురించే ఆలోచించుకుంటూ తన గదిలో కూర్చుని వున్నాడు దాసు. అతనికి ఆమె గురించిన బాధ ఎక్కువ. ఆమె ఆరోగ్యాన్ని గురించిన విచారణ. ఆమె వున్న నరకం ఎలా స్వర్గంగా మార్చగలుగుతానా అని ఆలోచన. ఎవరో తలుపుతట్టిన చప్పుడైంది. "ఎవరు?"

అంటూనే వెళ్లి తలుపు తెరిచాడు. లోపలి లైటువెలుతురు పార్వతిమీద పడింది.

"పార్వతీ!" అన్నాడు ఆమెను ఒడిసిపట్టుకుంటూ.

"దాసు!" అని అతని చేతుల్లో వాలిపోయింది. చేతినిండా నెత్తురయింది. దాసు చొక్కాకు నెత్తురు!

"ఏమిటి పార్వతీ! ఏంజరిగింది. చెప్పు? ఆ రాక్షసుడు ఏంచేశాడు? ఇంతకాలం చేసిన సజీవహత్య చాలక ఈ దారుణానికి పూనుకున్నాడా? చెప్పు పార్వతీ!" అంటూ విలపించసాగాడు దాసు.

వారి నేమీ అనకు దాసూ! తప్పంతా నాది. నేను ద్రోహిని."

"ఏమిటి పార్వతీ—ఏం జరిగింది చెప్పు. ఎందు కిలా క్షోభ పెడతావు నన్ను?"

"మీ పవిత్రమయిన చెవులతో వింటారా ఆ పాడు మాటలు! ఏ కల్మషమూ లేని మీకు ఎలా చెప్పేది. వొద్దు, వొద్దు. అబ్బా ... వొద్దు"

"పార్వతీ!"

"ఆయనకు ఎవరో చెప్పారట. మీరు నాకోసం...అబ్బ ఎలా చెప్పేది..." ఏడుస్తుంది చేతుల్లో మొఖం పెట్టుకొని.

"చెప్పమ్మా పార్వతీ—మా తల్లిగాదూ చెప్పు"

"మీరు నాకోసం ఆయన లేనప్పుడు వొస్తున్నారని ఎవరో చెప్పారట. మీకూ నాకూ సంబంధం కల్పించి, కొట్టి, రక్కి, ఇనపకుర్చీ తీసుకొని కొట్టాడు. "వాడిదగ్గరకే పో, నీ రంకుమొగుడు దగ్గరకే పో...నా వాకిలి తొక్కకు. నా ప్రతిష్టకు భంగం రానీకు. పో, చావు వాడితోనే" అని నెట్టాడు బైటకు. ఎంత ఏడ్చినా తలుపు తీశేడు కాదు. ఏంచేసేదిదాసూ!"

"వూరుకో పార్వతీ! నే నున్నానుగా. మూర్ఖుడు! ఎందుకూ, చదివాడు! లేనిపోని నిందల్ని వేయటానికా? పవిత్రమైన స్నేహానికి, రంకుతనానికి తేడా తెలుసుకోలేని గుడ్డివాడు. పోనీ పార్వతీ, నీకేం భయంలేదులే."

ఆమె తల గాయాలను అన్నిటినీ నీళ్ళతో కడిగి కొబ్బరినూనె రాశాడు ఓపిగ్గా. విసనకర్రతో విసురుతూ నిద్రపుచ్చాడు. ఆ రాత్రి పార్వతి అనేకసార్లు కలవరించింది. పాడు కలలెన్నో కన్నది. భయపడింది. కానీ, మధ్యమధ్య దాసు ఓదారుస్తోనే వున్నాడు. ఆమెమీద వేయికళ్ళు పెట్టుకొని చూసుకుంటున్నాడు పాపం దాసు!

దాసు జీవితం విచిత్రమైనది. అతడు ఎక్కడకు పోతాడో ఏం చేస్తాడో తెలీదు. రాత్రిళ్ళు యింట్లో వుండడు. ఎప్పుడూ తిరుగుతుంటాడు. ఒక వూరు, ఒక పల్లెగాదు. రోజుకు ఎన్ని వూళ్ళు తిరుగుతాడో లెక్కలేదు. తెల్లవారేసరికి ఇంటికొస్తాడు. మళ్ళీ చీకటి పడంది బైటకు కదలడు. యింట్లోకి

కావలసినప్పుడు ఎక్కడో పది రూపాయలు తీసుకొస్తాడు. కానీ, పార్వతి వొచ్చిన దగ్గరనుండి అతని పరిస్థితి మారిపోయింది. వెనుకటిలాగా పుస్తకాలు చదవలేక పోతున్నాడు. డబ్బురావటం లేదు. రోజూ జీవితంలో పార్వతికి సహాయంగా వుంటాడు. తనే వంటచేస్తాడు. యింటిపనులు చేస్తాడు. విచిత్రమయిన వ్యక్తి—కాదు—ఆదర్శవ్యక్తి!

పార్వతికి అతని ప్రవర్తన నచ్చిందికాదు. అతనొక్కడే కష్టపడి పనిచేసేవాడు. తన ఆరోగ్యము పాడవుతుందని ఒక్కపనీ ముట్టుకోనీడు. పగలంతా యింట్లోపని. రాత్రి బయట తిరుగుడు. క్షణం తీరిక, దమ్మిడీ ఆదా లేని వుద్యోగం.

"నాకోసం మరింత కష్టపడటం న్యాయంకాదు దాసూ" అంది.

నిజం! మీవాళ్ళందర్ని వొదిలి నన్ను నమ్ముకొని వొచ్చినందుకు సుఖపెట్ట వలసిన కనీసధర్మం అది. తల్లీ, తండ్రీ, అన్నలు, చెల్లెలు, స్నేహితులు, ఉన్నఊరు అన్నీ వొదిలి చేసుకున్న మొగుడిని నమ్ముకొనివచ్చే భార్యల్ని ఎంతో గౌరవంగా, పూజ్యంగా చూడవలసినదిపోయి, రాక్షసుల్లాగా, కీచకుల్లాగా ప్రవర్తించే భర్తను కాదుగదా, స్నేహితుణ్ని. ఆ మాత్రం సుఖం స్నేహితుని దగ్గర కాక పోతే యింకెక్కడ లభిస్తుంది పార్వతీ! పిచ్చిదానా!" అనేవాడు దాసు.

పార్వతికి రోగం తిరగబెట్టింది. దాసుగుండెల్లో పెషావర్ ఎక్స్‌ప్రెస్‌లు ప్రయాణం. ఏంచేస్తాడు? చేతిలో డబ్బులేదు. డబ్బువచ్చే సదుపాయం కూడాలేదు. కానీ తనను నమ్ముకున్న

పార్వతి!— ఏంచేయాలి? చేతికి వున్న ఉంగరం యిచ్చింది అమ్మి డబ్బు తెమ్మని.

డాక్టరు పార్వతికి తీవ్రంగా చికిత్స చేస్తున్నాడు. దాసు ఆత్రంగా పరుగెత్తుకొచ్చాడు. "డాక్టర్! మీరు ఆ గదిలోకి పోండి. వక్క-మాట మాట్లాడాలి, రహస్యం.'' అని పంపేశాడు. ఏమిటి దాసూ?'' అంది పార్వతి

'ఇవిగో పార్వతీ రూపాయలు! పోలీసు లొస్తున్నారు, నేను వెళ్ళాలి. డాక్టరుతో చెప్పు. నయమవుతుంది."

అంతలోకి పోలీసులొచ్చి దాసు చేతులకు బేడీలు వేశారు.

"అది నా వుంగరం. దొంగ వుంగరం కాదు.'' అన్నది పార్వతి.

"కావచ్చు. కానీ అది కాదు నేరం. కలకత్తానుండి పారిపోయి వచ్చిన కమ్యూనిస్టు ఈ దాసు" అన్నాడు పోలీసు అధికారి కర్క-శంగా.



# పరిష్కారం

ఒక వ్యక్తి సంస్కారం ఎప్పుడూ పుటకలతో రాదు. పూర్వజన్మ సంస్కారం అంటాం కాని, లోతుగా ఆలోచిస్తే ఆ సంస్కారం నిజం కాదేమో ననిపిస్తుంది. సమాజంకూడా వ్యక్తి సంస్కారాన్ని నిర్ణయించలేదు. వాతావరణం అంత కన్నా కాదు. వ్యక్తి విద్యాబుద్ధులే నిర్ణయించగలవు అతని సంస్కారాన్ని. అయినా ఈనాటి మానవుడి సంస్కారం ఎంతలో వుందంటే పాతను విసర్జించనూలేడు, కొత్తను స్వీకరించనూ లేడు. భగవదారాధన పూజ్యం కాదంటాడు. అని పూర్తిగా వొదిలిపెట్టనూ లేడు. అలాగే రెండింటి సంకుల సమరంలో నలిగి, జీవితాలను నాశనం చేసుకుని దౌర్భాగ్య దామోదరుడుగా తయారవుతాడు. ఒక్కొక్కసారి ప్రాణాలకే మోసం తెచ్చుకుంటాడుకూడా.

♦ ♦ ♦

వెంకటసుబ్బయ్యది మా వూరే. ఏదో పదెకరాల పొలం వుంది. ఒక పెద్ద పెంకుటిభవంతి వుంది. కాని అతనొక ప్రత్యేకమైన వ్యక్తిత్వం కలవాడు. సమాజం అతన్ని గౌరవిస్తుంది. అంటే అతని సంస్కారం ఈనాటి సమాజం గౌరవించేదిగా వుంటుంది.

వెంకటసుబ్బయ్య పెద్దగా చదువుకోలేదనేగాని, చదువుకున్నవారికంటె ఎక్కువ తెలివితేటలే వున్నాయి. ఎలాంటి

వారినైనా తన వాక్చాతుర్యంవల్ల యిట్టే ఆకర్షించగలడు. మహామేధావి అని చెప్పడానికి వీలులేదు గానీ, బొత్తిగా బుద్ధి తక్కువ వెధవ అనటానికీ వీల్లేదు. పత్రికా విజ్ఞానం అతనిలో చాలా వుంది. అలాంటి రాజకీయ విజ్ఞానంకూడ ఎక్కువగానే వుంది. అయితే ఆ వున్నది సంపూర్ణం కాకపోవచ్చు. సామాన్య పల్లెటూరి ప్రజల్లో పెద్ద అనిపించుకోటానికీ, వారిమీద అజమాయిషీ చేయటానికి, మంచికీ, చెడ్డకీ తనసలహాలకై వారిని రప్పించుకునేందుకు సరిపోతుంది. నాగరికతా ప్రపంచంలో అభ్యుదయ సంస్కారముతో పెరిగినవారి దృష్టిలో వెంకట సుబ్బయ్యా నాగరికతా సంస్కృతులుగానీ, రాజకీయ పరిజ్ఞానముగానీ అల్పం. చెప్పుకోదగ్గదిగాకూడా వుండదనుకోవచ్చు.

మా వూళ్ళో ఏదో కొంచెం అక్షరజ్ఞానం కలిగి ఉద్యమాల్లోతిరిగి, కాస్త వ్యక్తిగా జీవించగలిగినవాడు, జీవిస్తున్నవాడు వెంకటసుబ్బయ్యే గనక కొంచెం సంస్కారం గల కుటుంబములోని పిల్లను చేసుకోవాలనుకున్నాడు. గట్టి ప్రయత్నమే చేశాడు. అతనిశ్రమకు ఫలితంగా తులశమ్మ దొరికింది.

తులశమ్మ కేవలం బస్తీపిల్ల కాకపోయినా, బస్తీవాసన ఆమెలో జాస్తీగావుంది. అందంగా వుంటుంది. అయితే కొందరికి అందంగా వుండకనూపోవచ్చు. మొత్తానికి తులశమ్మ ఎర్రగా, సన్నగా, నాజూగ్గా వుండేది— పల్చటిపెదాలు. ఆ పెదాలు చూస్తేనే ముద్దొచ్చేవి. అంత అందమయిన పెళ్ళాం దొరికినందుకు వెంకటసుబ్బయ్యా నిజంగా గర్వించాల్సిన విషయం. వెంకట సుబ్బయ్యా మాటేమోగాని, అంత అందమైన

అమ్మాయినిచూసి మా వూరి యువకులంతా గర్వపడేవాళ్ళం. ఆ వెంకటసుబ్బయ్యకు పట్టిన అదృష్టమే మాకు పడితే (?) ఇంతకీ వొచ్చిన చిక్కేమిటంటే వెంకటసుబ్బయ్యా తనది అదృష్ట మని అనుకోడు; అనుకొనేటంత సంస్కారం ఆయనలో లేదు. సరదాగా అందరి మొగుళ్ళలాగానే తనూ ఒక మొగుడుగా ఉంటాడు పాపం! ఇంతకీ అతని బాధేమిటంటే తనలాంటి పలుకు బడిగలవాడు ఆడదాని దగ్గరకొచ్చి 'నువ్వు చాలా అందమైన దానివి' అని అంటాడా? అంటే తనకు, తనపదవికి ఎంత నామోషి! అట్లా అంటే తన పెళ్ళాం ఎంతగర్వపడుతుంది. ఇవాళ అది గర్వపడితే పొంగిపోయి రేపు యింకా తనమాట వింటుందా? తనను లెక్కచేస్తుందా? తనకెంత నామర్దా! రంభలా రొమ్మువిరుచుకు తిరగదూ? ఎందుకొచ్చిన తద్దినం కొని నెత్తిన పెట్టుకోవటం? అనుకున్నాడు వెంకటసుబ్బయ్యా. పెండ్లికాబొయ్యేముందు తులశమ్మ మొగుణ్ని గురించి ఎంతగానో అనుకుంది. తన కాబొయ్యేభర్త చదువుకున్నవాడనీ, తెలివిగలవాడనీ, మంచి పేరుగలవాడనీ విని పొంగిపోయింది. నిజానికి సహజమే. ఏ ఆడదైనా తనభర్తకు యింకాఏం ఎక్కువ కావాలని ఆశిస్తుందిగనక? అందరు ఆడంగులకు మల్లేనే తులశమ్మా ఆశించింది. త నాశించినవి తనకు కాబొయేభర్తలోవున్నాయని విని సంతోషించింది.

కాని అత్తవారింటికొచ్చాక అసలు బండారం బయట పడింది. తులశమ్మను అదుపాజ్ఞల్లో పెట్టడానికి వెనకఎత్తున అత్తమామలు లేరు. మామగారుఏనాడో చచ్చిపోయాడు. అత్తగారు ఎందుకు పుట్టింటికి వెళ్ళిపోయిందో ఎవరినడిగినా

చెప్పరు. వెంకట సుబ్బయ్యను చూసి అతనిలోని లోపా లను బయట పెట్టరు ఎవరున్నూ. కాని తులశమ్మ పాలేరునడిగి తెలుసుకుంది. పాపం! తెలుసుకొని అత్తగారిమీద సానుభూతి చూపి రెండువేడి కన్నీటిబొట్లు విడిచింది కూడా. వెంకట సుబ్బయ్య తల్లిని ఎప్పుడూ కొట్టేవాడట. రహస్యంగా రంపాన బెట్టి రాచేవాడట. నానా యాతనా పెట్టేవాడట. కొడుకుచేత నానా మాటలూ పడలేక, ప్రాణాలకు తెగించి పుట్టింటికి వెళ్ళి పోయిందట. యింత పేరు ప్రఖ్యాతులతో బ్రతుకుతున్న వెంకట సుబ్బయ్య తల్లిని తిడతాడా, కొడతాడా, యింట్లోంచి వెళ్ళి పోతే వుదాసీనంగా వూరుకున్నాడా అంటే వూరుకున్నాడు. అతని మనస్తత్వం ఎలాంటిదో ఎవరమూ చెప్పలేం. అతను అలా హింసించిన మాట మాత్రం వాస్తవం.

అత్త యింట్లోంచి వెళ్లిపోవటానికి కారణం అనుభవ పూర్వకముగా తెలుసుకుంది. కాపరాని కొచ్చిన ఏడాదికల్లా తులశమ్మ తెలుసుకుని భర్తను చీదరించుకుంది. అతని ప్రవర్త నకు అసహ్యించుకొంది.

పైకి మెరమెచ్చులుగా కనిపించే వెంకటసుబ్బయ్య సం స్కారం చాలా నీచాతి నీచమైంది. అతని ప్రవర్తనే చాలా అసహ్యకరం. తులశమ్మ ఏవిధంగానూ అతణ్ని మెచ్చుకోలేక పోయింది. సంవత్సరం తిరిగేటప్పటికి భార్యదృష్టిలో అంత నీచుడుగా చూడబడటం ఆశ్చర్యం.

వెంకటసుబ్బయ్య భార్యను. అదుపాజ్ఞల్లో పెట్టేందుకు ప్రయత్నించటం సాగించాడు. చీటికీ మాటికీ, అవసరంవున్నా లేకపోయినా కల్పించుకుని ఆమెలో తప్పులు చూపెట్టసాగిం

చాడు. ఈ ప్రవర్తనకు, పరివర్తనకు తులశమ్మ ఆశ్చర్యపోయింది మొదట తాను పెద్ద బొట్టు పెట్టుకోలేదని ఒకసారి తనమీాద పోట్లాడినసంగతి ఆమె మరచి పోలేదు యింకా. అప్పుడే మళ్లా సాగించాడు. "ఆడవాళ్ళు పత్రికలు చదవటం దేనికి? పుస్తకాలు చదవడం దేనికి? శుభ్రంగా యింట్లో పనిచేసుకోక" అని ఆడంగి రేకుల కబుర్లన్నీ పోగుచేసి భార్య మొఖాన వూదటం ప్రారంభించాడు.

ఒకసారి మా వూరిలో గాంధీ జయంతినాడు జరిగిన మహాసభలో వెంకటసుబ్బయ్య స్వయంగా, కాగితంమీాద వ్రాసుకొచ్చి ఉపన్యసించాడు. గాంధీజీ ఆశయాల్లో స్త్రీస్వాతంత్ర్యమనీ, స్త్రీ స్వాతంత్ర్యాన్ని అనుభవించాలంటే విద్యాబుద్ధులు ఉండాలనీ. అవి చదువువల్లగాని లభ్యంగావనీ గంభీరోపన్యాసం జేశాడు.

ఆనాటి మహోపన్యాసానికి అతను పొందిన ప్రశంసలు అనంతం. అతని ఖర్మంకాలి తులశమ్మ ఆనాడు అతని వుపన్యాసం విన్నది. భర్త తనతో పోట్లాట్టం చూసి "మీారేగదండి అనాడు ఆడవాళ్లంతా చదువుకోవాలన్నారు!" అన్నది.

"ఏనాడు?" అన్నాడు వెంకటసుబ్బయ్య

"గాంధీ జయంతినాడు"

"ఓ! అదా!" ఒక్కసారి ఫక్కుననవ్వి "అది అందరికోసం చెప్పిందిగాని, నీక్కోసంగాదు. అయినా అది గాంధీగారి ఆశయమని చెప్పానుగాని నా ఆశయమని చెప్పలేదే" అన్నాడు.

అతని తెలివితేటలకి ఏడవాలో నవ్వాలో అర్థంగాలేదు తులశమ్మకు.

కానీ, యిలాంటి గిల్లికజ్జాలు రోజు రోజుకు యిద్దరి మధ్యా విపరీతంగా పెరిగిపోతున్నాయ్.

పాపం! అందుకు తులశమ్మను అనవలసినపని లేదు. పనీపాటా లేని వెంకటసుబ్బయ్యా కాలక్షేపంకోసం పెళ్ళాంతో పోట్లాటపెట్టుకునేవాడు. అతని వుద్దేశం ఏమిటంటే: "వున్నా, లేకపోయినా లోపాలను వున్నట్లుగా చూపిస్తే, నిజంగా ఆ లోపాలు తనలో వున్నాయనుకొని భార్య తులశమ్మ అణగి మణగి వుంటుం" దని అతని భావన. కానీ, అలా జరుగుతుందో, దాని పరిణామం యింకా ఎలాగైనా మారటానికి అవకాశం వుందేమో వెంకటసుబ్బయ్యా వూహించుకోలేదు.

కాని, తులశమ్మ జీవితం దుర్భరం అనుకుంది. వెంకటసుబ్బయ్యాతో కాపురం చేయటం కష్టం. కొత్తచీర కట్టుకోటానికి వీల్లేదు. తల దువ్వుకోటానికి వీల్లేదు. అందంగా అలంకరించుకుంటే "కాపురం చేసుకునేదానికి నీ కెందుకే అలంకారాలు, అందాలు? తీసెయ్యి" అని దగ్గరుండి తీయించేవాడు.

వెంకటసుబ్బయ్యలో మరో దుర్గుణం ఏమిటంటే "నే కోరని అలంకారం, అందం నీ కెందుకు? నీ అందమంతా నా కోసమేగదా, భర్తను తృప్తిచెందించటమేగదా పతివ్రతా లక్షణం. నా కిష్టంలేని అలంకారాలు నీ కెందుకు? అలా నా కంగీకారం లేని ఆభరణాలతో నన్నేం తృప్తిపరుస్తావు? కానప్పుడు నువ్వేం పతివ్రతవు? అనేవాడు.

ఇంటికి భార్యతో మాట్లాట్టానికి ఏ ఆడవారినీ రానిచ్చేవాడు కాడు. వాస్తే, తన భార్య ఎక్కడ చెడిపోతుందో;

వాళ్లలా యిళ్ల వెంట తిరుగుతుందేమో, తన పరువుప్రతిష్టలు నష్టమైపోతాయేమోననే బాధ అతనిది.

ఈమధ్య అర్ధరాత్రిళ్ళు మరోవిధమయిన పోరాటం సాగించాడు. రాత్రిళ్లు నిద్రపోనీడు, తానుపోడు. "ఆ కమత గాడు నీతో ఏమిటి మాట్లాడుతున్నాడు? ఏమిటి వాడితో నవ్వుతూ మాట్లాడుతున్నావు? వాడికీ నీకూ ఏమిటిసంబంధం!" అని చావగొట్టి నానా హింసలూ పెట్ట సాగాడు.

కానీ, ఈ విషయాలు బయటవారి కెవరికీ తెలియవు. ఎవరికీ తెలియనీడు. కాని లోపల్లోపల ఆమెను చేసే హింస రెండోకంటివాడికి తెలియదు.

ఒకనాడు తెల్లవారేసరికి నీలాటిరేవులో గుసగుసలు ప్రారంభమయినయ్యి. జనం గుమిగూడారు. వూళ్లోంచి జనం విరగబడి వొచ్చి చూస్తున్నారు. 'వెంకటసుబ్బయ్యభార్య తులశమ్మ ఉరిబోసుకు చచ్చిపోయింది' యిదే ఎవరినోటవిన్నా.

పాపం! ఆమె దురదృష్టానికి విచారించారు వెంకట సుబ్బయ్యా తత్వం తెలిసిన కొద్దిమంది. వెంకటసుబ్బయ్యా భార్య పతివ్రతయని చెప్పుకున్నారు. కొందరు కాడీమూకకూడ అనుకోకపోలేదు నాసా తిరుగుళ్ళు తిరగటానికి వీల్లేక వురి బోసుకు చచ్చిందని. ఎవ రెన్నిమాట లనుకున్నా వెంకట సుబ్బయ్యా చెవినిబడలేదు. ఒకవేళ విన్నా విననట్లుగా నటించే వాడు వెంకటసుబ్బయ్యా.

తన కేమీ తెలవనట్టుగా వెంకటసుబ్బయ్యా తులశమ్మ మరణానికి దుఃఖించాడు. కాని, అతని కన్నీటిబొట్లు తులశమ్మ హృదయాన్ని ఏనాడూ శాంతింపచెయ్యలేవు.

# అవ్యక్తత

సముద్రం మారుమూలల్లోంచి వస్తూన్న అలజడి,అంచు ల్లేని అంచులకు తగిలి చేసే తరంగాల ధ్వనులు, గాలిలో దూరంగా ప్రతిధ్వనిస్తున్నయ్. పశ్చిమాకాశంలో చంద్రుడు సాంద్రంగా అస్తమిస్తున్నాడు. బీచిలో పల్చగా జనం...

ఏకాంతంగా కూర్చుని ఆలోచిస్తున్న సుదర్శనం నడుం వాల్చాడు ఆ యిసుక మైదానంమీద. అలాగే మరి కొంతసేప టికి కన్ను మూశాడు...జీవితంలోని రసవత్తర ఘట్టాల్ని స్మృహకు తెచ్చుకుంటూ బాధల్ని, గాధల్ని తలపోస్తూ...

చుట్టూ అలజడి—యిద్దరు ముగ్గురు వ్యక్తులు...రాత్రి పదిగంటల అమవసచీకటి. సుదర్శనం మత్తుగా కళ్ళు తెరి చాడు— తెరవాలని అనుకున్నాడు, ప్రయత్నించాడు. కాని, తెరవలేకపోయాడు. ఎవరో బలంగా అతని తలను, చేతుల్ని అదిమి పట్టుకున్న జ్ఞాపకం. కాని తెలివిలేదు. ఎవరో తెలీ దతనికి.

కళ్ళు తెరచి చూచాడు. చుట్టూ చీకటి. అఖండమైన సముద్రపు హోరు. సముద్రంపైన నల్లని చీకటి కప్పు. ప్రభం జన ప్రకంపనానికి రేగే జుట్టు;...అలజడి, అలలు, భావాల బాటలు వంకరటింకర్లుగా, చిందరవందరగా. అతనికి జ్ఞాపకం లేదు ఏంజరిగిందో; ఏంజరుగుతూందో స్ఫురణలేదు. అలాగే మత్తుగా, బాధగా కళ్ళుమూశాడు మళ్ళీ.

మైకమా? మరణమా? మూర్ఛా?

మెత్తని చల్లనిచేయి అతనినుదుటిమీద—అలా ఎంత సేపుగా ఆ చేయి సేవచేస్తోందో అర్ధరాత్రి చీకటిలో అలా ఒంటరిగా పడివున్న అతనికి!...సుదర్శనానికి కొద్దికొద్దిగా తెలివొస్తూంది.

సగం మూసుకున్న అతని చూపులకు ఎదురుగా ఒక మూర్తి. ఎవ రామె? ఏంచేస్తోంది తనకు! ఇందాకా తనను కొట్టింది, బాధించింది ఆమేనా? అయితే ఇప్పుడు చేస్తోన్న దేమిటి? ఇంకా బాధిస్తోందా - అతని మనస్సుచుట్టూ గందరగోళంగా ప్రశ్నలు.

ఆమెకంఠం శ్రావ్యంగా వినిపించింది అతనిచెవులకు. అందులో కరకుదనంగానీ బాధాహృదయంగాని ద్యోతకం కావటం లేదు. ఎవరు?— అందామనుకున్నాడు. కాని నోట మాట పెగలలేదు. అలాగే ఆలోచనతో కళ్ళుమూసుకున్నాడు.

'ఎలావుంది?' ఆమె కంఠంలోంచి మధురధ్వని.

కళ్లు తెరిచి చూచాడు. ఆమె తెల్లనికళ్ళు మెరుస్తున్నాయ్.

"ఊఁ!" అని మూలిగాడు.

"రండి...లేవండి వెళదాం..."

'ఎక్కడికి?' అందామనుకున్నాడు.

'ఇక్కడే మా యిల్లు. దగ్గరలోనే...పది అడుగులు-ఎలాగో ఓపిక తెచ్చుకొని పదండి, నేను పట్టుకుంటాను'

కాదనలేక పోయాడు సుదర్శనం. కాదనేందుకు అవకాశంకూడా లేదు. అసలు ఆ సమయంలో, ఆ ఆపత్సమయంలో

తనమంచిని, శ్రేయస్సును అభిలషించే దెవరు?... ఎవరూ, ఏ ఆదరువూ లేని నిర్జనారణ్యంలో ఉన్న తనకు, ఆ ఎడారిలాంటి సముద్రతీరంలో...

ఆమె సహాయంతో అడుగులో అడుగు వేసుకుంటూ... ఆలోచిస్తో,... నడుస్తున్నాడు ఆమె చూపే దోవన... ఏ మహాప్రస్థానంలోకో, ఏ ప్రపంచంలోకో!

ఒది చిన్న గుడిసె. తాటాకులయిల్లు. ఇంట్లో మిణుకు మిణుకు మంటూన్న గుడ్డిదీపం.

కొబ్బరితాళ్ళతో అల్లిన మంచం. దానిపైన గోనె పట్టాల పక్క. అతణ్ణి దానిమీద పడుకోబెట్టింది ఆమె. వేడి వేడి పాలు అతనికి ఆపూట ఆహారం. ఎక్కువగా మాట్లాడ లేక పోయాడు... ఒంటరిగా ఉన్న స్త్రీతో ఆరాత్రికి అలాగే గడిపాడు ఆలోచనలమధ్య తేలే తెప్పలాగా!

ఉదయం కొంచెం స్వస్థత చేకూరింది. బయట ప్రపంచాన్ని చూచాడు. అంతా అయోమయం. తనకు పరిచయమైన ప్రదేశంకాదు. తాను పడుకొనిఉన్న, దెబ్బతిన్న ప్రదేశంగాదు. రాత్రి తను నడిచింది ఓ వంద గజాలకన్న ఎక్కువ ఉండదు. కాని వందగజాలు కాదు, రెండుమైళ్ళు నడచినా ఆ ప్రదేశం కొత్తగానే ఉంది.

ఆమెనడిగాడు సుదర్శనం."నే నిక్కడికి ఎట్లా వొచ్చా" నని.

'నాకుమాత్రం ఏం తెలుసు చెప్పండి. రాత్రి అటు పోయి వస్తూంటే దోవలో తెల్లగావుంటే మొదట చీకట్లో భయపడ్డాను...ఏ తెల్లదెయ్యమోనని. కాని ధైర్యంతో దగ్గర

కొచ్చాను. మీరు! మీరు ఎవరైంది నాకు తెలవదు. కాని, ఆ స్థితిలో చూడంగానే ఏదో ప్రమాదంలో ఉన్నారని స్ఫురించింది. తప్పేదిలేదు. ఈ ప్రాంతాల నేను గాక మరెవరూ కాపరం ఉండటంలేదు. ఆపత్సమయంలో సహాయంచేయటం మానవుని కనీసధర్మంగదాండి !

'అవును లేండి...అయినా మీరిలా ఒంటరిగా...' అనుమానాన్ని వెల్లడించాడు సుదర్శనం.

'అదంతా పెద్దగాథ. చెప్పితే తీరేదిగాదు. నేను జీవితంలో పడ్డకష్టాలు, వెధవ కుళ్ళుప్రపంచంతో పోరాడి, అలసిపోయి, నిర్జనాన్ని, ఏకాంతాన్ని కోరుకున్నాను. జీవితంలో అనుభవించవలసిన సుఖాలన్నీ ఎప్పుడో అనుభవించాను. పుణ్యాపాపాల ప్రసక్తే లేదు నా కిప్పుడు.నాకున్న ఆస్తికొద్ది. ఈ కొంపలో ఉంటూ ఈ చిన్నఅడవిలో తిరుగుతూ భూమ్మీదవున్న నాలుగురోజులు ప్రశాంతంగా గడుపుదామనుకున్నాను. అంతే.'

'ఇంతకూ పేరు చెప్పారుగారు'

"పేరు...ఒక పేరేమిటి. అసలు పేరు లేకపోతే ఏం... ఏం, పేరు చెప్పకపోతే—పోనీ 'మానవి' అనండి అంత అవసరమైతే."

ఇంక ఆమెతో ఏమ్మాట్లాడుతాడు మానవమాత్రుడైన సుదర్శనం! ఆమె పెద్ద వేదాంతిలాగా, మహర్షిలాగా మాట్లాడుతోంటే.

సుదర్శనం జీవితం హాయిగా వుంది ఆమెతో. పదహేను రోజులు అలాగే జరిగింది. ఒకరోజు 'మానవి' చెప్పింది:

"ఓ చిన్నపని చేయాలి మీరు."

"తప్పకుండా చేస్తాను. అంతకన్నానా!" అన్నాడు సుదర్శనం.

ఆమె చెప్పింది- "మీరు పట్టణం పోయిరావాలి!"

"పట్టణం! ఎక్కడుంది పట్టణం?"

"అంత ఖంగారుపడతారేం! చెపుతున్నాగా! మూడు మైళ్ళు పోవాలి. అక్కడికి పోయి మార్వాడీదగ్గర కొద్దిగా బంగారం మార్చుకురావాలి. కొన్ని సరుకులుకూడా తీసుకు రావాలి. అయిపోయినాయ్. అసలు ఎప్పుడూ నేనే పోయే దాన్ని కాని, బద్ధకంగా వుంది. ఏమీ అనుకోరుగదా, పని చెప్పానని!"

'ఏబ్బే! అనేందు కేముంది యిందులో! ఫరవాలేదు" అన్నాడు సుదర్శనం.

ఓ చిన్న 'నెక్ లెస్' తీసి యిచ్చింది. "ఇది నాదికాదు, మా అమ్మది. నా పెళ్లికి పెట్టింది. ఎంతో గారాబంగా పెంచుకునేది. కానీ, అన్నీ గతించినయ్ యిప్పుడు" అంటూ ఏడుపు మొహం పెట్టింది.

ఆమె తల్లి చచ్చిందికామాలు్ను ఏడుస్తోంది అనుకున్నాడు సుదర్శనం. "పోనీలే, ఎంతకాలం బ్రతుకుతారు!" అని ఓదార్చాడు.

సుదర్శనం పట్టణంలో అలా అవుతుందని అనుకోలేదు పాపం! మార్వాడీదగ్గరకు 'మానవి' చెప్పినట్లు ఎకాఎకీని వెళ్ళాడు. వస్తువు చూపించి డబ్బివ్వమన్నాడు.

"ఎక్కడిదయ్యా ఇది నీకూ?" అన్నాడు మార్వాడీ.

"ఎక్కడిదేమిటి—నాదే. డబ్బు అవుసరం. తొందరగా డబ్బివ్వు!"

"కొంచెంసేపు కూర్చో వస్తాను" అని చెప్పి ఎవరి చెవిలోనో ఏదో చెప్పి పంపాడు మార్వాడి.

పది నిముషాల్లో పోలీసులు, ఇన్‌స్పెక్టరు వచ్చారు. సుదర్శనం గుండె కొట్టుకోసాగింది.

"ఎవరు, ఇతనేనా? అన్నాడు ఇన్‌స్పెక్టరు సుదర్శనాన్ని చూపిస్తూ మార్వాడీతో.

"ఏమిటి?" అన్నాడు సుదర్శనం.

"ఎక్కడిదీ నగ నీకు?" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"నాదే" తడుముకోకుండా చెప్పాడు.

"ఊఁ! నీదేనన్నమాట? ఇది దొంగసొమ్ము. గుంటూరులో షావుకారు రిపోర్టుచేసిన సొమ్ములో యిది ఒక నగ. ఇది నీదికాదని రుజువవుతూంది. ఎందువల్లంటే ఆ షావుకారు గురవయ్య పేరిదిగో, పైగా నీదని దబాయిస్తున్నావేం దొంగ వెధవా! నడు స్టేషనుకు!"

వెంటనే పోలీసులు అతని చేతులకు బేడీలు వేశారు. స్టేషనుకు నడిపించారు.

సుదర్శనంకు అంతా కలలాగా వుంది.'మానవి' మోసం చేసిందని అనుకోటంలేదు.తన దురదృష్టమేనని తలపోస్తున్నాడు.

జైల్లో కూర్చున్న సుదర్శనంకు ఏదో ఒకటి తక్కువగా అన్ని అవస్థలూ వస్తున్నయ్. రిహార్సల్లో నటునివలె అతని ముఖంచూపని భావం లేదు.

సుదర్శనానికి జైల్లో మరి నలుగురు స్నేహితులు పోగ య్యారు. అందరూ చదువుకున్న వాళ్ళు, వివేకవంతులు. వాళ్ళు జైల్లోకి ఎందుకొచ్చారో, ఎలా వచ్చారో నని సుదర్శనానికి అనుమానం. అడిగాడు తెగించి.

వారు చెప్పింది నిజమే! అందరూ 'మానవి' మాటల్లో మోసపోయినవాళ్ళే. అందరికీ ఒకేరకం అవస్థలు. బీచిలో ఉండగా ఎవరో కొట్టటం. 'మానవి' తీసుకుపోవటం, ఎక్కడో పడెయ్యటం, చివరకు సుశీల, కమల, సుగుణ, మానవి అనే పేరులు గల స్త్రీ వాళ్ళని రక్షించటం, ఈవిధంగా జైలుకుపంపటం.

"అయితే ఆ మనిషిని పట్టుకోగూడదూ పోలీసు?" అని అడిగాడు సుదర్శనం.

"నిజమే పట్టుకోవచ్చు; కాని, ఆ మనిషి దొంగలగుంపు లోది. ఆసొమ్మంతా చౌకగా కొంటాడు మార్వాడి. మనం తెచ్చిన సొమ్ముకు తరువాత డబ్బు ముట్టుతుంది మానవికి, ఆ మార్వాడీకి. పోలీసుల విషయం చెప్పనవసరంలేదుకదా.

సుదర్శనానికి అంతా ఆశ్చర్యంగా ఉంది. ఇలాంటి సంఘు టనలు ప్రపంచంలో జరుగుతాయని అతనెప్పుడూ అనుకో లేదు. అసలు ఎరుగడు కూడాను. అసలు విచారం తాను జైల్లో పడ్డందుకు కాదు. ప్రపంచం ఇంతనీచంగా ఉందేమాఅని.

"అయితే మన్ని వదిలేదెప్పటికి?" అనిఅడిగాడు సుదర్శనం.

"ఈ జరిగిన విషయమంతా మర్చిపోతామని వాగ్దానం చేసినప్పుడు. ఈ విషయాలన్నీ ఎవరితో చెప్పమని ఒప్పుకున్న ప్పుడు" అన్నారు వాళ్లు నలుగురు.

సుదర్శనం కళ్లు నవ్వుతున్నయ్.





**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B117 |
| పుస్తకం పేరు | ఎర్రభూతం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 97 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Afsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |